# కొత్తపల్లి పిల్లల కథల పుస్తకం-71 సెప్టెంబరు 2014

**మూలం:** http://kottapalli.in/2012/09/welcome


**ఏపని- ఎవరిది:**

ప్రచురణ: కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి

నిర్వహణ: సత్య ఫౌండేషన్, చెన్నూరు.

ప్రధాన సంపాదకులు: నారాయణ

చిత్రాలు: వీరాంజనేయులు, అడవి రాముడు, ఫైనార్ట్స్ చదువుతున్న ఇతర మిత్రులు

వెబ్సైటు నిర్వహణ: ఆనంద్, లక్ష్మి

వాణిజ్యం, సహకారం: మల్లికార్జున

గౌరవ సలహాదారు: సుబ్బరాజు

అక్షర కూర్పు: కొత్తపల్లి

అలంకరణ: యాక్తూ ఫైన్ ఆర్ట్స్ స్టుడియో, హైదరాబాదు. ఫోను: 04042206233

ముద్రణ: ముద్రికా ఆఫ్‌సెట్ ప్రింటర్స్, విజయవాడ

ఫోను : 08662579129


స్వాగతం!

కొత్తపల్లిలో పిల్లల రచనలకు ప్రాధాన్యత ఉంటుంది. ఈ పుస్తకంలో దాదాపు సగం కథలు పిల్లలు రాసినవి; మిగిలినవి పిల్లలకోసం పెద్దలు రాసినవి. బొమ్మలు వేసిన వాళ్ళు మటుకు యువకులు.

పిల్లలను కలవటం, వాళ్లతో తెలుగులో కథలు రాయించటం, బొమ్మలు వేయించటం, వాళ్ళు పంపిన కథల్ని, బొమ్మల్ని సరిదిద్ది మిగతా పిల్లలందరికీ నచ్చేట్లు పుస్తకాలుగా తయారు చేయటం, దానికోసం ఓపెన్ సోర్సు ఉపకరణాలను వాడటం, కథల్ని అందరూ ఉచితంగా చదువుకునేట్లు ఇంటర్నెట్‌లో పెట్టటంతోపాటు, కొన్ని ప్రతులు అచ్చు వేయటం మాకు ఇష్టం. అందరి మేలూ కోరి చేసే ఈ పనిలో మీరూ పాలుపంచుకోండి. పిల్లల కథల ప్రపంచానికి స్వాగతం !



**వెలల పట్టిక:**

| | **వ్యక్తులు** | **సంస్థలు** |
|---|---|---|
| **విడి ప్రతి వెల** (పోస్టేజీ అదనం) | **25** రూ. | **30** రూ. |
| **12 ప్రతులు** (పోస్టేజితో సహా) | **300** రూ. | **350** రూ. |

రానున్న 12 ప్రతులకోసం డబ్బుల్ని మనిఆర్డరు/బ్యాంకు ట్రాన్సుఫరు ద్వారా చెల్లించవచ్చు. దయచేసి మీ చిరునామాను వేరుగా ఫోను/యస్సెమ్మెస్/మెయిలు ద్వారా తప్పక తెలియజేయగలరు. పుస్తకాలను సాధారణ పోస్టులో పంపుతాం,

బ్యాంకు ట్రాన్సుఫరు కోసం అక్కౌంటు వివరాలు:
Kottapalli Prachuranalu,
S.B. A/c No: 62320333310
SBH- Dharmavaram Branch,
ISFC code: SBHY0020902


కొత్తపల్లి ప్రచురణలు

1-127/A, యం ఆర్ వో ఆఫీసు దగ్గర,

చెన్నేకొత్తపల్లి- 515101

అనంతపురం జిల్లా

ఫోను: 7702877670 ఇ-మెయిలు: team@kottapalli.in

వెబ్‌సైటు: http://kottapalli.in




# విషయ సూచిక

# మనసు మాట

అనగనగా గోపయ్య అనే రైతు దగ్గర ఒక గొప్ప ఎద్దు ఉండేదట. అది చాలా మంచిదీ, బలంగా ఉండేదిన్నీ. అయినా అది చాలా శాంతంగా ఉండేది. గోపయ్య ఏ పని చెబితే దాన్ని, చాలా ఇష్టంగా చేసి పెట్టేది.

గోపయ్య కూడా ఆ ఎద్దును చాలా ప్రేమగా, జాగ్రత్తగా చూసుకునేవాడు. దాన్ని అస్సలు కొట్టేవాడు కాదు. దాని మీద ఈగను కూడా వాలనిచ్చేవాడు కాదు. ఆ ఎద్దు గురించి అందరితోనూ గొప్పగా చెప్పేవాడు.

ఒకసారి గోపయ్య ఊళ్ళో పెద్ద మనుషులతో మాట్లాడుతూ "నా ఎద్దు నూరు బండ్లను ఒకేసారి లాగేస్తుంది- కావాలంటే వెయ్యి నాణేలు పందెం" అనేశాడు. కొందరు ఆ మాటను వినీ విననట్టు ఊరుకున్నారు కానీ, గోపన్న అంటే సరిపోనివాళ్ళు కొందరు జట్టు కట్టి, "పందెం అంటే పందెం" అన్నారు.

పందెం రోజు రానే వచ్చింది. ఊళ్ళో వాళ్ళు నూరు బండ్లనూ వరుసగా ఒకదాని వెనుక ఒకటి కట్టి ఉంచారు. గోపయ్య ఎద్దును తెచ్చి మొదటి బండికి కట్టాడు. ఎద్దుకు ఇదంతా కొత్తగా ఉంది. అయినా యజమాని తెచ్చి నిలబెట్టాడు గనక, అట్లా ఊరికే నిలబడిందది. అందరూ 'లాగు లాగు' అన్నారు. కానీ ఎద్దు మాత్రం కదల్లేదు. గోపయ్య ఏం చెబుతాడోనని ఎదురు చూస్తూ అది అట్లానే నిలబడి ఉన్నది.

గోపయ్యకు తల తీసేసినట్లయింది. 'ఎద్దు బళ్ళను ఎందుకు లాగట్లేదు?' అని చికాకు మొదలైంది- ఆ చికాకులో 'తను దానికి లాగమని చెప్పనేలేదు' అని అతనికి గుర్తుకే రాలేదు. పైపెచ్చు, అది 'నా పరువు తీస్తోంది' అని చటుక్కున కోపం కూడా వచ్చేసింది: "వెయ్యి

నాణేలు... పోగొట్టకు! వెయ్యి నాణేలు!! ఎప్పుడైనా చూశావా? అంత తిండి తినేది ఎందుకట, ఈ మాత్రం లాగలేవా?!" అని తిడుతూ, అందరు రైతుల లాగానే తనూ దాన్ని మొరటుగా చర్నాకోలతో కొట్టటం మొదలు పెట్టాడు అతను.

గోపయ్య అంతకు ముందు ఎన్నడూ దానితో కోపంగా మాట్లాడలేదు. ఏనాడూ దాన్ని తిట్టలేదు; ఒక్క దెబ్బకూడా వెయ్యలేదు! మరి ఇప్పుడు అతను అంత కోపంగా అరవటం, పైపెచ్చు చర్నాకోలతో కొట్టటం ఎద్దుకు ఏమాత్రం నచ్చలేదు. దాంతో అది పూర్తిగా మొండికేసింది- ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేదు. దాన్ని కొట్టీ కొట్టీ అలసిపోయిన గోపయ్య పదిమందిలోనూ ఓటమిని అంగీకరించాల్సి వచ్చింది. డబ్బుతోబాటు పరువునూ పోగొట్టుకొని, తలవంచుకొని ఇల్లు చేరుకున్నాడతను.

"గతంలో అవసరం ఉన్నప్పుడు చాలా సార్లు ఈ ఎద్దే వంద బండ్లను అలవోకగా లాగేసింది గదా, మరి ఇవాళ్ల ఎందుకు లాగలేదు?!" అన్న ఆలోచన రాలేదు, కోపంతో రగిలిపోతున్న గోపయ్యకు. అయితే ఆరోజు సాయంత్రం చూసేసరికి, ఎద్దు మేత మేయకుండా- స్తబ్దుగా నిలబడి ఉన్నది. దాని ఒంటినిండా చర్నాకోల వాతలు- ఆ గాయాల చుట్టూ ఈగలు ముసురుతుంటే అది విసురుకోవటం కూడా లేదు. గోపయ్య వంకే చూస్తూ కన్నీరు కారుస్తున్నది!

దాన్ని చూసే సరికి గోపయ్య హృదయం ద్రవించింది. దాని గాయాలకు మలాం రాస్తూ అతను తన తప్పును గ్రహించాడు: 'ఈ మూగ జంతువుకూ హృదయం ఉంది. తన మాట నెగ్గాలన్న తొందరలో తను దాన్ని అనవసరంగా, కౄరంగా శిక్షించాడు. సున్నితమైన దాని మనసుకు గాయం కలిగించాడు!'

గోపయ్య కళ్ల నీళ్ళతో దానికి క్షమాపణ చెప్పుకొని, నిమిరి, ముద్దుచేసి, దగ్గర చేసుకున్నాడు. అతని మనసును గ్రహించిన ఎద్దు కూడా కొంత కుదుటపడ్డది.

తెలివి తెచ్చుకున్న గోపయ్య తర్వాతి రోజున మళ్ళీ గ్రామస్తులతో పందెం కాశాడు. 'ఈసారి పందెం రెండు వేల నాణేలు' అన్నారు గ్రామస్తులు. ఈసారి గోపయ్య ఎద్దుని కొట్టలేదు సరికదా, కనీసం అదిలించను కూడా లేదు. ప్రేమగా వీపు నిమిరి, 'లాగురా!' అనేసరికి, ఎద్దు వంద బండ్లనూ లాక్కొని ముందుకు ఉరికింది!



గోపయ్య పందెం నెగ్గటమే కాదు; జీవితాంతం ఉపకరించే పాఠం ఒకటి నేర్చుకున్నాడు- 'ఎంత తొందర, ఎంత చికాకు ఉన్నా సరే, మనసుల్ని మటుకు గాయపరచకూడదు' అని.

చక్కని ఈ కథని మళ్ళీ ఓసారి గుర్తు చేసిన ఆరో తరగతి 'రచన'కు కృతజ్ఞతలు.

జాగ్రత్తగా చూస్తే, పసి పిల్లలలో కూడా అనంతమైన శక్తి దాగి ఉన్నది. ప్రేమ, ఆప్యాయతలు వాళ్ళు తమ ఈ శక్తిని వాస్తవీకరించుకునేందుకు సహాయపడతాయి. అందుకనే, మంచి ఉపాధ్యాయులు అందరూ ఏనాటికీ పిల్లల హృదయాల్ని అర్థం చేసుకొంటారు- సున్నితమైన మనసులతోటి సున్నితంగానే ప్రవర్తిస్తారు.

పసి మనసుల్ని గాయపరచకుండా పాఠాలు చెప్పే అలాంటి గురువులందరూ ధన్యులు. అలాంటివారందరికీ వేల వేల నమస్కారాలు! పేరు పేరునా గురుపూజోత్సవ శుభాకాంక్షలు!

కొత్తపల్లి బృందం




# నీతి చంద్రిక

సంధి-5

*జరిగిన కథ: కాకిని గుడ్డిగా నమ్మి, యుద్ధంలో పరాజయం పాలయింది హంస. అయినా మంత్రి దూరదర్శి మటుకు రాజ్యాన్ని దానికే తిరిగి ఇచ్చేయమని సలహా ఇచ్చింది నెమలికి. నెమలి అందుకు ఒప్పుకోలేదు. తర్వాత అది కాకితో మాట్లాడినప్పుడు, హంసను మోసం చేసిన ఆ కాకి కూడా, హంసనే మెచ్చుకుంటూ మాట్లాడింది ! ఇక చదవండి, నీతి చంద్రిక 52 వ భాగం.....*

*మూలం: కీ.శే. కందుకూరి వీరేశలింగం సరళీకరణ: ఘడియారం వేంకట నారాయణ శర్మ*

"ఓహో! అంత గొప్పవాడా! అందుకనే కాబోలు, నీచేత అంత సులభంగా మోసపోయాడు!. ఏది ఇంకొంచెం పొగుడు అతన్ని, విందాం!" అన్నది నెమలి వెటకారంగా.

అప్పుడు కాకి చిన్నబుచ్చుకొని కూడా, ధైర్యంగా "ప్రభూ! ఎవరినైనా పూర్తిగా విశ్వసించి, ఆ నమ్మకంకొద్దీ ఏమారి ఉంటే, అలా ఆదమరచిన వాళ్ళని మోసం చేయటం ఏమంత పెద్ద ఘనకార్యం కాదు. నమ్మి,

మన తొడ మీద తల పెట్టుకొని నిద్రపోతున్నవాడి గొంతు కోసి చంపటమూ ఒక పౌరుషమేనా?".

'నల్లని వన్నీ నీళ్ళు, తెల్లనివన్నీ పాలు' అనుకొనే అమాయకులు 'మా లాగానే లోకంలో అందరూ కూడా మంచివాళ్ళు; ఎల్లప్పుడూ సత్యమే చెబుతారు; మోసం అంటే ఏంటో కూడా తెలియని వాళ్ళు' అనుకుంటూ ఉంటారు. తమ లోపల ఉండే మాయ మర్మాలు బయటపడకుండా, నేర్పుతో తేనె పల్కులు పలికే దుర్మార్గుల వలలో- మొదట మొదట, తమ అమాయకత్వం కొద్దీ -చిక్కుకుంటారు కూడా.

అయితే అలా ఒకటి రెండు సార్లు నష్టపోయిన తర్వాత, ఆ అనుభవాన్ని అనుసరించి తర్వాతి కాలంలో జాగ్రత్త పడుతుంటారు, వాళ్ళు కూడానూ.

ఎవరైనా క్రొత్తగా వచ్చిన వాడి గుణగుణాలను వాడి మాట తీరును బట్టి నిశ్చయించు-కోవాలి తప్పిస్తే, వాడి మనసులోకి జొరబడి చూడలేరు కదా! గతంలో ఇట్లాగే బ్రాహ్మణుడొకడు మోసగాళ్ళ మాటల వలనే మోసపోయాడు కదా- తమరికి ఆ కథ చెబుతాను వినండి:

## బ్రాహ్మణుడు-దొంగలు



మంచి నిష్ఠగల బ్రాహ్మణుడు ఒకడు ఒకరోజున యజ్ఞం చేయాలనుకున్నాడు. ఆ యజ్ఞం కోసం నల్ల మేక ఒకటి కావలసి ఉండింది. అతను పొరుగూర్లో అలాంటి మేక నొకదాన్ని సంపాదించుకొని, దాని మెడకొక త్రాడు కట్టి, చాలా సంతోషంగా

దాన్ని ఇంటికి యీడ్చుకొని పోసాగాడు.

దారిలో ఒక చెరువు గట్టు మీద కూర్చున్న దుర్మార్గులు కొందరు ఆ మేకను చూసి ముచ్చటపడ్డారు. దాన్ని కాజేయాలని, వాళ్లలో ఒకడిలా అన్నాడు- "ఇదిగో, యీ బ్రాహ్మణుడు ఎంత చక్కగా బలిసిన మేకపోతును తీసుకు పోతున్నాడో చూడండి. ఒక బంగారు నాణెం ఇచ్చి కొందామన్నా మనకు ఇట్లా క్రొవ్విన పోతు దొరకదు. ఈ బ్రాహ్మణుడిని మోసం చేసి దీన్ని ఎలాగైనా కాజేశామంటే, ఇక వారం రోజుల వరకూ మనం ఇటూ అటూ వెతుక్కునే పని లేకుండా మాంసం తింటూ గడపవచ్చు" అని.

దానికి మరొకడు "బ్రాహ్మణుడు పిశాచంలాగా పట్టుకొని ఏమారకుండా దాని గొంతుకు ఉరి త్రాడు మల్లే కట్టి లాక్కుపోతున్నాడే! దాని పెనుగులాటకు ఊర్లో దుమ్మంతా ఎట్లా రేగుతున్నదో చూడండి. పట్టపగటి పూట, నడిరోడ్డున- మనం వాడి కళ్ళు కప్పి దీన్ని లేవనెత్తుకు పోయేదెట్లాగ? ఇంతమంది కళ్ళు కప్పగలమా? వీలుకాదు- వదిలెయ్యండి. రాజభటులు కూడా దుడ్డు కర్రలు పట్టుకొని నగరంలో అంతటా తిరుగుతున్నారు. 'దొంగలు' అని పట్టుకుపోయి మన కోపిష్టి రాజు ఎదుట నిలబెట్టారంటే, ఘోర శిక్షలకు గురవ్వాల్సివస్తుంది. దేవుడు మనకు ఇచ్చినదాన్ని తింటూ సుఖంగా ఉండక, క్రొవ్వెక్కి, చేయరాని పనులు చేస్తే మనందరికి ఒకేసారి చుక్కలు కనిపిస్తాయి. వృథా ప్రయాసవద్దు. దీని వల్ల మనకు అవమానం కలుగుతుంది తప్ప, మన కోరిక మాత్రం నెరవేరదు. నా మాట విని వీడిని వదిలెయ్యండి" అన్నాడు.

చిన్ననాటి నుండే మోసపు పనులు చేసి చేసి రాటు దేలి పోయిన ముసలిదొంగ ఒకడు వీడి మాటలకు పకపకా నవ్వి-"ఒరే! నీకు అనుభవం లేక పిరికి మాటలు మాట్లాడుతున్నావు గానీ, నిజంగా నాలాంటి వాడు తలచుకుంటే ఇంత చిన్న పని సాధించటం ఎంత ?! మూడు కళ్ళున్న ఆ

పరమశివుడిని కూడా మోసం చేసి నా కోరికను యీడేర్చుకోగల శక్తి నాకున్నది. చూస్తుండు. మీరంతా చూస్తుండగానే, నా శక్తి చేత, యీ మేకను కుక్కను చేసి తీసుకువస్తాను- మీ కోరిక తీరేట్లు దీని మాంసంతో మీకందరికీ విందు చేస్తాను; మీ చేత 'శహబాష్' అనిపించుకుంటాను. మొసలిని మోసగించే కదా, కోతి తన ప్రాణం కాపాడుకున్నది?! ముందు మీకు ఆ కథ చెబుతాను వినండి- అని ఇలా చెప్పసాగాడు:

**కోతి-మొసలి**

పశ్చిమ సముద్ర తీరాన ఉన్న అడవిలో 'బలవర్ధనుడు' అనే ముసలి కోతి ఒకటి నివసిస్తూండేది. ముసలి తనం వల్ల దాని శక్తి సన్నగిల్లేసరికి, దాయాదులు దాని ఆస్తులనన్నింటినీ దోచుకొని, దాన్ని వెళ్ళగొట్టి అడవుల పాలు చేశారు. బలవర్థనం అడవుల్లో అంతటా తిరిగి- తిరిగి చివరికి 'తపతి' నది ఒడ్డున పళ్ళతో నిండిన గొప్ప మేడి చెట్టునొకదాన్ని ఆశ్రయించుకున్నది. ఆ పళ్ళనే తింటూ కాలం గడుపు కొస్తున్నది.

ఇట్లా కేవలం పళ్ళు మాత్రం తింటూ జీవిస్తున్న కోతి ఆ మేడి చెట్టు మీదే సుఖంగా చాలాకాలం ఉన్నది. ఒక రోజున పండ్లు తింటూంటే ఒక మేడి పండు దాని చేతిలోంచి జారి, క్రింద ఉన్న నీళ్ళలో పడి 'బుడుంగు'మంటూ మునిగింది. కోతి చెవులకు ఆ శబ్దం చాలా నచ్చింది. తనలో ఉన్న కోతి ప్రవృత్తి బయటపడగా, బలవర్ధనం ఒకదాని తర్వాత మరొక మేడి పండును వరసగా నీళ్ళలోకి విసిరి, ఆ శబ్దం వినటం, కేరింతలు కొట్టడం మెదలెట్టింది.



సరిగ్గా ఆ సమయానికే చెట్టు క్రిందికి వచ్చి, బురదలో వచ్చి పడుకొని ఉన్నది, "క్రకచం"

అనే ఒక మొసలి. కోతి విసిరిన పండొకటి నేరుగా దాని నోట్లోనే పడింది. అది పండుని చప్పరించి, రుచి మరిగింది. అటుపైన అది నీళ్ళలోకి పోయి, కోతి విసురుతున్న పండునల్లా పట్టుకొని నాలుక దురద తీరేట్లు మెల్ల మెల్లగా చప్పరించుకుంటూ తిన-సాగింది.

అలా పళ్ళమీది ఆశ కొద్దీ అది కోతితో స్నేహం చేసి, ఇల్లూ-వాకిలీ మర్చిపోయి, భార్యాబిడ్డలను వదిలేసి, నెలల కొలదీ అక్కడే కాలక్షేపం చేయటం మొదలు పెట్టింది.

ఇక అక్కడ, దాని ఇంట్లో, క్రకచం భార్య దాని కోసం వేచి చూసీ-చూసీ, ఇక తాళలేక, భర్తను తలచుకొని రాత్రనక-పగలనక కళ్ళలోంచి కన్నీరు ధారలు కట్టగా ఏడుస్తూ ఉండి, చివరికొక స్నేహితురాలిని పిలిచి, "ఒసే! నా ప్రాణ నాధుడికి ఏమైందో, మరి ఇంతకాలంగా ఇంటికి రాలేదు. ఆయన క్షేమం విచారించి కనుక్కో; ఆయన జాడ తెలిపి పుణ్యం కట్టుకో. లేకపోతే నా ప్రాణాలిక నిలువవు" అని అనేక విధాలుగా ప్రార్థించింది.



ఆ చెలికత్తె కూడా వేగంగా అన్ని దిక్కులూ వెతికి, చివరికి ఆ మేడి చెట్టు క్రింద, కోతితో ముచ్చటలాడుతూ నవ్వులు కురిపిస్తున్న మొసలి వీరుడు క్రకచాన్ని కనుగొని, ఆ సంగతినే క్రకచం భార్యకు తెలియ జేసింది- "తల్లీ! నీ భర్త క్రకచం ఒక ఆడ కోతి సావాసం మరిగింది. ఆ మురిపెంలో అది ఒళ్ళు మరచి పోయింది. ఇక నీ గోడు- నీ పిల్లల గోడు పట్టించుకునేట్లు లేదు తల్లీ" అని, ఉన్నవీ- లేనివీ కల్పించి చెబుతూ, గుండెల్లో నీరు కుక్కుకున్నది!

(...తర్వాత ఏమైందో మళ్ళీ చూద్దాం!)



# అందం

*"శరీరం అందంగా ఉండటం అనేది పూర్తిగా మన చేతుల్లో ఉండదు. కానీ మనసు పరిశుభ్రంగా ఉండటం మటుకు మన చేతుల్లోనే ఉంది" అంటూ మధుశ్రీ రాసిన ఈ కథ మీకూ తెలుసేమో...?*

*రచన: మధుశ్రీ, తొమ్మిదో తరగతి, జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, పొట్లూరు, గుంటూరు జిల్లా.*



అనగనగా ఒక అడవిలో చాలా జంతువులు నివసించేవి. ఒక రోజున చక్కని ఓ నెమలి నల్లని కాకిని చూసి "మిత్రమా! నేనెంత అందగా ఉన్నానో చూశావా? అందరూ నన్ను ఇష్టపడతారు. కానీ నువ్వు? ఎట్లా ఉన్నావో చూడు! నల్లగా, దిష్టిబొమ్మలాగా?! అందుకనే నిన్ను ఎవరూ ఇష్టపడనిది!" అనేసి నవ్వుకుంటూ వెళ్ళిపోయింది.

ఆ మాటలు విని కాకికి చాలా బాధ వేసింది. అది గూటికి వెళ్ళి, తన అందం గురించే ఆలోచిస్తూ దిగాలుగా కూర్చున్నది. అంతలోనే అటుగా వెళ్తున్న ఓ చిలుక దాన్ని

చూసి ఆగింది. "ఏమి కాకి బావా! కులాసానా?" అని అడిగింది. ఏదో లోకంలోఉన్న కాకికి అసలు అదేమన్నదో కూడా వినిపించలేదు.



చిలుక అప్పుడు కాకి దగ్గరకు వెళ్ళి కూర్చొని "కాకి బావా! ఏమి, దిగాలుగా ఉన్నావు?" అని అడిగింది. కళ్ళ నీళ్ళు పెట్టుకొని జరిగిన విషయమంతా చెప్పింది కాకి. అంతా విని చిలుక "కాకి బావా! బాధపడకు. నిజానికి మనం చూసేందుకు ఎలా ఉంటే మాత్రం ఏమున్నది? ఎలా ప్రవర్తిస్తున్నాం అన్నది ముఖ్యం. రూపు ఏద్దైతేనేమి, మనసు ముఖ్యం కదా. నీకంటూ ఒక రోజు తప్పక వస్తుంది- బాధపడకు!" అని దాన్ని ఓదార్చి వెళ్ళిపోయింది.

అది అన్నట్లే ఒక రోజున కాకికి అవకాశం వచ్చింది. వేటగాడు ఒకడు చెట్ల మాటునుండి నెమలికి బాణం గురిపెట్టాడు. ఆ సమయానికి నెమలి వెనక్కి తిరిగి పురివిప్పుకొని నాట్యం చేయటంలో మునిగి ఉన్నది. వేటగాడిని చూడగానే కాకి నెమలిని హెచ్చరిస్తూ "మిత్రమా! పారిపో! వేటగాడు!" అని గట్టిగా అరవటం మొదలు పెట్టింది. గబుక్కున ఈ లోకంలోకి వచ్చిన నెమలి తోక ముడుచుకొని వెనక్కి తిరిగి చూడకుండా పారిపోయింది. వేటగాడు దాని వెంట పడ్డాడు. నెమలి చెట్ల కొమ్మల మీదుగా దూక్కుంటూ అతి కష్టం మీద వాడి బారినుండి తప్పించుకోగలిగింది.

తరువాత ఆ రోజు సాయంత్రం నెమలి కాకిని వెతుక్కుంటూ వచ్చి కృతజ్ఞతలు చెప్పుకోవటమే కాకుండా తనను క్షమించమని అడిగింది. "ఎందుకు, ఏం తప్పు చేశావు?" అంది కాకి. నెమలి తనను

ఎగతాళి చేసిన సంగతి అసలు గుర్తే లేదు దానికి!

"ఆ రోజు నువ్వు అందంగా లేవని చులకనగా మాట్లాడాను కదా, నీ మంచితనాన్ని గుర్తించలేదు. అయినా నువ్వు దాన్ని మనసులో పెట్టుకోకుండా ఇవాళ్ల నా ప్రాణాలను కాపాడావు. నన్ను క్షమించు. శరీరాల అందం కంటే మనసుల అందమే గొప్పదని నాకు అర్థమైంది. ఇకమీద నేను ఎవ్వరినీ కించపరచను" అన్నది నెమలి, కాకి చేతులు పట్టుకొని.

"ఓ, అదా?! ఆ రోజున నువ్వు అట్లా అనే సరికి చాలా బాధేసింది. కానీ అప్పుడు నేను ఏమీ అనలేక, నాలో నేనే ఏడ్చుకున్నాను. ఇకమీద ఎవ్వరిని గురించీ చులకనగా మాట్లాడనన్నావుగా! ఏమీ పర్లేదు. ఇప్పటి నుండి మనం అందరం ఫ్రెండ్స్" అంటూ సంతోషంగా చేతినందించింది కాకి. అదే సమయానికి అక్కడికి వచ్చిన చిలుక సంతోషంగా చప్పట్లు కొట్టింది.

అటుపైన నెమలి, కాకి, చిలుక అడవిలో కలిసి మెలిసి సంతోషంగా జీవించాయి.

**అమ్మెవరు?**

నవ్వు!

సువర్ణ: మీ అమ్మ ఉందా, బిట్టూ!?

బిట్టూ: ఏమో- మా మమ్మీని అడిగి చెబుతాను ఆగండి ఆంటీ!

**కలలో పరుగులు!**

డాక్టర్: నేను చెప్పినట్లు ఆటలు ఆడుతున్నావా లేదా, అస్సలు బరువు తగ్గలేదు ?!

రాజయ్య: రోజూ క్రమం తప్పకుండా చదరంగం ఆడుతున్నా డాక్టరు గారు!

**ఏదో ఒకటి మార్చు!**

దివాకర్: నీ జబ్బు పూర్తిగా నయమైనట్లుందే, ఏమైనా మందులు మార్చావా?

సుధాకర్: లేదు- డాక్టరును మార్చా.



# జామకాయ వ్రతం

రచన: జి. సుస్మిత్, ఆరవ తరగతి, రాధా స్కూల్ ఆఫ్ లర్నింగ్, సమతాగ్రం, అనంతపురం



రంగాపురంలో యాదయ్య అనే బిచ్చగాడు ఒకడు ఉండేవాడు. పని చేసి డబ్బు సంపాదించుకునేందుకు శక్తి ఉన్నా, ఊరికే అందరినీ అడుక్కొని డబ్బు సంపాదించుకునేవాడు అతను. "కష్టపడి డబ్బు సంపాదించుకోవచ్చుకదా?" అని ఎవరైనా అతనిని అడిగితే, "నా కష్టాలేవో నేను పడతాను నీకెందుకు?" అని పొగరుగా సమాధానమిచ్చేవాడు.

ఆ ఊరిలోనే సౌజన్య అనే అమ్మాయి ఉండేది. తను చాలా తెలివైనది. యాదయ్య తీరును గమనించిన సౌజన్య, అతనితో ఎలాగైనా మార్పు తేవాలనుకొని, ఆలోచించింది. తనకొక పథకం తట్టింది.

ఒకరోజు యాదయ్య బిక్షాటన చేస్తుండగా,

సౌజన్య అతనిని పిలిచి "ఒక్కసారిగా ధనవంతులు కావాలంటే ఏం చెయ్యాలో నాకు తెలుసు. నీకు ఒక్కసారిగా ధనవంతుడివి కావాలని లేదా?" అని అడిగింది.

"ఎందుకు లేదు?" అన్నాడు యాదయ్య, కొంత తడబడుతూ. మరైతే "నువ్వు జామకాయ వ్రతం చేయాలి" చెప్పింది సౌజన్య. యాదయ్య తెల్లమొహం వేశాడు-"జామకాయ వ్రతమా?! దాన్ని ఎలా చేయాలి?" అని.

"అదేమంత కష్టమైన వ్రతం కాదులే, నువ్వు సులభంగానే చెయ్యగలవు. వ్రతం చెయ్యాలనుకునేవాళ్ళు ముందు ఒక మూట జామకాయలు కొనాలి. ఒక్కో జామపండును రెండు రూపాయలకు ఒక్క పైసా తగ్గించకుండా అమ్మాలి. ఇలా వరసగా పదిహేను సార్లు చెయ్యాలి. ఇలా వచ్చిన డబ్బులను మితంగా, అవసరమైనంత వాడుకోవచ్చు కూడా. ఇంకేమి, మిగిలిన డబ్బులను దాచుకుంటే సరి. ఎంత డబ్బును దాచుకుంటే అంత ధనవంతుడివి అవుతావు నువ్వు!" చెప్పింది సౌజన్య ఉత్సాహంగా.



యాదయ్య తన దగ్గర మూట జామకాయలు కొనడానికి డబ్బులు లేవన్నాడు. "అయ్యో! సొంత డబ్బులు వాడుకోకపోతే వ్రతం ఫలించదే?! మొదటిసారి జామకాయలకోసం నీ ఇంట్లో ఉన్న పైసా పైసా వాడుకుంటే తప్ప ప్రయోజనం ఉండదు. నేనేమీ చెయ్యలేను" అన్నది సౌజన్య.

"సరే, చూస్తానులే. ఇంట్లో అంతా వెతికితే ఒక మూటకు సరిపడా డబ్బులు దొరక్కపోవు" అన్నాడు యాదయ్య కొంచెం ఆలోచించి.

మరునాడే అతను జామకాయల మూటను కొని, సౌజన్య చెప్పినట్లు, చక్కగా అమ్ముకున్నాడు. సౌజన్య కూడా వాళ్ల అమ్మా నాన్నలిచ్చిన డబ్బుతో అతని దగ్గర కొన్ని జామకాయలు కొనుక్కున్నది. అట్లా వరసగా పదిహేను రోజుల పాటు జామకాయలు అమ్మాడు యాదయ్య.

వ్రతం అయిపోయాక చూస్తే, ఆశ్చర్యం! యాదయ్య దగ్గర చాలా డబ్బు ఉన్నది! అతను సౌజన్య దగ్గరకు వెళ్ళి, సంతోషంగా "నీ వల్లే నాకు ఈ వ్రతం గురించి తెలిసింది. ఇందులో కొంత డబ్బు నువ్వు తీసుకో!" అన్నాడు. సౌజన్య అప్పుడు నవ్వుతూ "నిజానికి జామకాయ వ్రతం అనేది ఏదీ లేదు యాదయ్యా! 'ఊరికే అడుక్కుని బ్రతుక్కోవచ్చు' అనే నీ ఆలోచనలో మార్పు తెచ్చేందుకే ఇలా చేశాను. కష్టపడి పనిచేసి బ్రతకటంలోని సంతోషం ఇప్పుడు నీ అనుభవంలోకి వచ్చింది కదా, అది చాలు నాకు" అన్నది.

శ్రమశక్తితో సంపాదించిన డబ్బు విలువను రుచి చూసిన యాదయ్య ఇక ఆ రోజునుండీ కష్టపడి పనిచేసి డబ్బులు సంపాదించటమే కాదు; వాటిని పొదుపుగా వాడుకొని, చూస్తుండగానే తన వ్యాపారాన్ని విస్తరించుకున్నాడు. సుఖంగా జీవించాడు.

**సమస్య పెద్దదే!**

సుబ్బారావు: డాక్టరు గారూ! నాకు ఈమధ్య కళ్ళు అస్సలు కనిపించడం లేదండి!

శేఖర్: అవునండి- తెలుస్తూనే ఉంది.

రవి(సంతోషంగా) : మీరు మా గొప్పవారు డాక్టరు గారు! ఎలా కనిపెట్టేశారండి?

చంద్ర: ఎలాగంటే, మరి మీరు వచ్చింది హాస్పిటల్ కి కాదండి- దాని ప్రక్కనున్న హోటల్ కి!



# కష్టం వచ్చింది సుఖం తెచ్చింది

చర్చ

*మూలం: C.H.క్రాంతి, ఇంటర్ మీడియట్, శ్రీకాకుళం.*



ఒక ఊరిలో శర్వా అనే పిల్లవాడు ఒకడు ఉండేవాడు. వాడు రోజూ బడికి వెళ్ళేవాడు; కానీ తరగతిలో మాత్రం వాడి దృష్టంతా సినిమాల మీద, ఆటల మీద, షికార్ల మీదే ఉండేది. ఈ మధ్య వీడికి "ఫ్రెండ్స్ ఫాలోయింగ్" కూడా పెరిగి పోతోంది- సార్ చెప్పింది కొంచెం కూడా బుర్రకెక్కదు!

ఇక పరీక్షలు వస్తే వాడి పనల్లా- "ఒరే...ఒరే...చూపించరా!" అని తెలివైన పిల్లల్ని అడుక్కోవటం. నిజానికి అందరూ బ్రిలియంట్సేనండి: కొందరు మంచిగా చదువుకుని "బ్రిలియంట్" అనిపించు-కుంటారు; కొందరు వీడిలా "జులాయి" అనిపించుకుంటారు.

అయితే ఇప్పుడు శర్వా చేతిలో పుస్తకాలు ఉన్నాయన్న మాటేగానీ, బుర్రలోకి ఒక్క

అక్షరం కూడా ఎక్కడం లేదు. మాస్టారెప్పుడూ డెవిల్ లాగా అరుస్తాడు- 'పైకెదగండ్రా' అంటాడు. "నేనింకా ఎంత ఎదగాలి, మా అమ్మ అయితే నన్ను 'చెట్టులా పెరిగావు గదరా!' అంటుంది. అసలు చదువెందుకు? నాకయితే పుస్తకం చేతిలోకి రాగానే నిద్ర ముంచుకొస్తుంది!" అని తనలో తాను అనుకోసాగాడు శర్వా.

అలాగని అతనేమీ గొప్ప ధనవంతుడు కాదు. చాలా పేదవాడు. నిజానికి వాళ్ళకు సొంత ఇల్లు లేదు- అద్దె ఇంట్లో ఉంటున్నారు; తల్లి ఇంటి దగ్గరే మిషన్ కుట్టుకుని, చిన్న టైలర్ గా పేరు తెచ్చుకుని, డబ్బులు సంపాదించి జీవనం సాగిస్తుంది. తల్లేమో ఇలా; కొడుకేమో అలా! తల్లేమో 'కొడుకుని బాగా చదివించాలి; మంచి ఉద్యోగం రావాలి' అన్న ధ్యాసలో ఉంది. కొడుకేమో జులాయిలా ఉంటున్నాడు.

పరిస్థితులన్నీ ఎప్పుడూ ఒకే లాగా ఉండవు కదా. ఒక రోజు రాత్రి శర్వాకి, వాళ్ళమ్మకి అన్నం లేదు. ఖాళీ కడుపుతోనే పడుకోవలసి వచ్చింది. అప్పుడు ఆలోచించాడు శర్వా- 'తన లాంటి వాళ్ళు ఎంత మంది ఇలా తినేందుకు తిండి లేక అకలితో పడుకుంటున్నారో' అని. ఆకలి బాధ తెలిసొచ్చింది- ఒక్క మన దేశంలోనే భోజనం లేక ఆకలితో పడుకునే పేదవాళ్ళు ఇరవై కోట్లకు పైగా ఉన్నారు. అయినా ప్రభుత్వానికి పేదవారు కనిపించరు... ఈ వ్యవస్థ అలాంటిది!

ఆ నాడు శర్వాకి తెలిసొచ్చింది- 'విద్య రాకపోవటం' అనేది ఎంత దురదృష్టమో. "బ్రతకడానికి డబ్బులుండాలి- ఆ డబ్బులు కావాలంటే విద్య కావాలి! చదువులైనా రావాలి; లేకపోతే ఏదో ఒక వృత్తి విద్య అన్నా రావాలి.."

ఇక ఆ రోజు నుండి శర్వా షికార్లు, సినిమాలు, స్నేహితులతో ఊరికే తిరగడం- ఇవన్నీ బంద్ చేశాడు. చక్కగా చదువుకోవడం మొదలు పెట్టాడు.

తరగతిలో సార్ చెప్పుతున్న అంశాలను

మనసుపెట్టి వినటం మొదలు పెట్టాడు. పరీక్షల్లో తన ప్రతిభని కనబరచసాగాడు.



ఏ రోజుకారోజు పాఠాలను పూర్తిగా చదివి నేర్చుకున్న తర్వాతనే నిద్రపోవటం మొదలు పెట్టాడు. తల్లి కూడా వాడిలోని మార్పును గమనించింది. వాడి చదువుల్లో సాయపడసాగింది.

అయితే మరో వైపున తల్లీ కొడుకుల జీవనం మరింత దుర్భరమైంది. పేదరికం ముదిరింది. కొడుకుని చదివించే శక్తి లేక 'ఒరే, చదువుని ఆపేసి ఏదైనా కూలిపని చెయ్యిరా' అంటుంది తల్లి- "అమ్మా! చదువుని ఆపమనకమ్మా! కొన్నేళ్ళు చక్కగా చదివానంటే, మంచి ఉద్యోగం చేయచ్చు. మన కష్టాలన్నీ తీరుతాయమ్మా! ఆలోగా చదువుకునే టైములో తప్ప, మిగతా ఖాళీ సమయంలో కథలు, నాటికలు, జోక్స్ వంటి రచనలు చేసి 'రచయిత'గా పేరు తెచ్చుకుంటాను. నా రచనల్ని పుస్తకాలుగా ముద్రించేవాళ్ళు ఇచ్చే డబ్బుతో చదువుకుంటానమ్మా! నా మాటను కాదనకు" అంటాడు కొడుకు.

ఈ రోజుల్లో ప్రతీదీ అమ్ముతున్నాడండీ, ఈ మానవుడు! నీళ్ళ దగ్గర నుంచి ప్రతీదీ అమ్ముతున్నాడు. వాడు ఏదైనా అమ్ముతాడు- చివరకు పీల్చే గాలిని కూడా.. చదువునే అమ్ముతున్నాడు కదా ప్రస్తుతం?! ఇక రాబోయే కాలంలో ఆనాటి పుస్తకాల్లో చెప్పే ప్రతీ అక్షరాన్నీ అమ్ముకుంటాడు. అవసరమైతే సూర్యుడ్ని కూడా ఎవడికో అమ్మేస్తాడు: "ఏయ్...! సూర్యుడ్ని నేను

కొన్నాను. సూర్యుడు నావాడు. సూర్యుడి నుండి వచ్చే వెలుగు నాది. దానికి ఫైన్ కట్టు" అంటాడు.



వాడికి వ్యాపారమే... వ్యాపారం. అది తప్ప మరింకేదీ లేదు. అయినా 'మనకెందుకులే, ప్రజలకి లేనిది మనకెందుకు?' అని అనుకుంటే ఇక పశువుకు, మనిషికి తేడాయే లేదు!

అటుపైన శర్వా చదువులు బాగా చదివాడు. రకరకాల పరీక్షలు రాసి, డాక్టరయ్యాడు. మరో వైపున అతను గొప్ప మానవత్వం ఉన్న రచయితగా కూడా పేరు తెచ్చుకున్నాడు.

డాక్టర్-రచయిత! ఎలా ఉండిన శర్వా, ఎలా అయ్యాడో చూశారుగా? సుఖం కావాలంటే ముందు కష్టాన్ని అనుభవించాల్సిందే, తప్పదు. కష్టం సుఖానికి తాళంచెవి లాంటిది.

అందుకని, నేను మీకు చెప్పేదేమంటే, తల్లిదండ్రులు మనకు చెప్పే ప్రతీ విషయాన్ని అర్థం చేసుకోవాలి. 'ఎందుకింత నస?' అనుకోకూడదు. శర్వా చివరకు తన తల్లి కన్న కలల్ని పూర్తి చేశాడు- కొడుకంటే అలా ఉండాలి!

మరి మీరు ఎలా ఉండాలనుకుంటున్నారు. డాక్టరు శర్వాలాగానా, లేకపోతే తిరుగుబోతు వెధవగానా? నిర్ణయం మీదే!

దృఢ సంకల్పమే విజయసాధనకు తొలిమెట్టు -ఫెర్డినాండ్ ఫాచ్



# కిడ్నాప్

*"స్నేహం శాశ్వతం కాని డబ్బు కాదు" అంటూ పవన్ కల్యాణ్ ఈ కిడ్నాప్ కథ రాసి పంపాడు. ఇదీ అన్ని కిడ్నాప్ కథల్లాగే ఉంది, కానీ కథనం బాగుంది- ఇదిగో, చూడండి..*

*రచన: ఇ. వెంకట పవన్ కల్యాణ్, తొమ్మిది జాస్మిన్, అరవింద స్కూల్, కుంచనపల్లి, గుంటూరు జిల్లా.*

పవన్, వాడి స్నేహితులు ముగ్గురు- రోహిత్, సునీల్, రవి- నలుగురూ బస్టాపులో నిలబడి ఉన్నారు. అందరూ బస్సు కోసం ఎదురు చూస్తున్నారు:

అంతలో అకస్మాత్తుగా ప్రక్క సందులోంచి కారు ఒకటి- వేగంగా వచ్చి, పవన్ ముందు నిలబడింది. అది అంత దగ్గరగా వస్తుందని ఊహించని పవన్ తూలి ఒక్క అడుగు వెనక్కి వేసాడు-

అంతలోనే హఠాత్తుగా ఇద్దరు మనుషులు కారులోంచి దిగారు గబగబా. ఏం జరుగుతోందో తెలిసే లోపే పవన్‌ను పట్టుకొని కారులోకి నెట్టారు! ప్రక్కనే నిలబడి ఉన్న రోహిత్ వాళ్లను అడ్డుకున్నాడు; కానీ వాడికంటే చాలా బలంగా ఉన్నారు కదా, ఆ యిద్దరూ వాడిని ప్రక్కకు తోసి పడేసారు. పవన్‌ను కారు లోపలికి నెట్టిన మరుక్షణం గూండాలు ఇద్దరూ కారులోకి ఎక్కారు; కారు ముందుకు దూసుకుపోయింది!

పవన్ స్నేహితులు ముగ్గురూ హాహా మని అరుస్తూ కారు వెంట పడ్డారు. కానీ ఎంత దూరమని పరుగెత్తుతారు? వాళ్ళు

చూస్తుండగానే కారు కనుమరుగయ్యింది.

ఇక కారు లోపల, పవన్ గూండాలిద్దరితోటీ పెనుగులాడేందుకు ప్రయత్నించాడు. అయితే నాలుగు బలమైన చేతులు వాడిని నొక్కి పెట్టి ఉంచాయి. వాడు కదిలిన కొద్దీ అవి వాడిని మరింత బలంగా ఒత్తాయి. దాంతో వాడు బుద్ధి తెచ్చుకున్నట్లు కదలక మెదలక ఉండిపోయాడు.

అయినా వాడి బుర్ర మటుకు చురుకుగా పనిచేయసాగింది: "వీళ్ళు ఎవరు? తననే ఎందుకు పట్టుకున్నారు? ఎక్కడికి తీసుకు వెళ్తున్నారు? ఎందుకు?.."

రాము ప్రక్కన ఉన్న కిటికీ తెరచే ఉన్నది. దాని గుండా చల్లటి గాలి వస్తోంది. రాము మెల్లగా తన పుస్తకం ఒక దాన్ని కిటికీలోంచి బయటికి జారవిడిచాడు.

"క్యా బోల్తా హై లడకే కా బాప్?" అడిగాడు కారు డ్రైవరు.

"క్యా కరేగా, పచాస్ లాఖ్ లాకర్ దేదేగా" ఇకిలించాడు ఒక గూండా.

"ఔర్ కుఛ్ కర్ భీ నహీ పాయేగా" పెద్దగా నవ్వాడు మరొకడు.

పవన్‌కు హిందీ రాదనుకొని వాళ్ళు ముగ్గురూ ఆ భాషలో మాట్లాడుకుంటున్నారు.



కానీ పవన్‌కు హిందీ వచ్చు- వాళ్ళ మాటలు అర్థం అవుతున్నాయి వాడికి. ఎక్కువ భాషలు నేర్చుకుంటే ఎన్ని ప్రయోజనాలో..! పవన్ మెల్లగా మరో పుస్తకాన్ని బయటికి జారవిడిచాడు..

పవన్ వాళ్ళ నాన్న ఆ ఊళ్ళో పేరున్న పారిశ్రామిక వేత్త. వీళ్ళు పవన్‌ని కిడ్నాప్ చేసి, వాళ్ళ నాన్నని యాభై లక్షల రూపాయలు ఇమ్మని అడుగుతారన్నమాట!

పవన్ తన దగ్గరున్న వస్తువుల్ని, పుస్తకాలను ఒక్కటొక్కటిగా బయటికి జార విడుస్తూ వచ్చాడు. అతని దగ్గరున్న చివరి వస్తువును బయట పడేసాక కొంత సేపటికి కారు ఆగింది.

"బాంధ్ దో లడకేకో. ఉస్కా బాప్ ఆనే తక్ ఉస్కో కుఛ్ నహీ దేనా" అన్నాడొకడు.

మరొకడు పవన్‌ను బయటికి లాగాడు. పవన్ చుట్టూ కలయ చూశాడు- అక్కడంతా నిర్జనంగాఉంది. చుట్టు ప్రక్కల వేరే ఇళ్ళేమీ ఉన్నట్లు లేదు. కారు ఓ ఒంటరి ఇంటి ముందు ఆగి ఉన్నది.

గూండాలు ముగ్గురూ కలిసి పవన్‌ను ఆ ఇంట్లోకి లాక్కెళ్ళారు. అక్కడ ఒక స్తంభానికి కట్టేశారు వాడిని. అటుపైన గూండాలు ముగ్గురూ హిందీలోనే మాట్లాడుకుంటూ గదికి తాళం పెట్టి బయటికి వెళ్ళిపోయారు.

పవన్ కొంతసేపు పెనుగులాడాడు. కానీ దొంగలు వాడి కాళ్ళు చేతులు కట్టేసి ఉన్నారు- ఏమీ పెద్ద ప్రయోజనం లేకపోయింది.

ఒక గంట-రెండు గంటలు గడిచేసరికి ఇంటి బయట శబ్దం అయ్యింది. "పవన్.. పవన్.." అని అరుపులు వినబడ్డాయి.

ఎవరో పవన్ ఉన్న గది తాళం పగలగొట్టి లోనికి వచ్చారు- పోలీసులు! వాళ్ల వెనకనే రోహిత్, సునీల్, రవి!

"తొందరగానే కనుక్కున్నారే!" నవ్వాడు పవన్.

"తెలివంటే నీదేరా! పుస్తకాలు పడేయటం చాలా గొప్ప ఐడియా!" మెచ్చుకున్నారు మిత్రులు ముగ్గురూ, పవన్ మీదికి దూకి వాడి కట్లు విప్పేస్తూ.

"చాలు చాలు. ఇప్పుడింక శబ్దం చెయ్యకండి. దొంగలు ఏ క్షణాన్నైనా వచ్చేస్తారు. మీరు ఈ గదిలోనే ఓ మూలగా కూర్చొని ఉండండి, కదలకుండా" అన్నారు పోలీసులు కూడా

నవ్వుతూ, ఇంట్లో అన్ని ప్రక్కలా దాక్కుంటూ.

కొంత సేపు గడిచింది. కొంతసేపటికి పవన్‌ను పట్టుకున్న గూండాల గొంతులు వినబడ్డాయి.



ఇంటి తలుపులు చూడగానే వాళ్లకు ఏదో అనుమానం వచ్చినట్లున్నది- మాటలు ఆగిపోయాయి. పోలీసులు తుపాకులు సర్దుకొని నిలబడ్డారు అన్ని ప్రక్కలా. వాళ్ళు తలుపులు తీసుకొని లోపలికి అడుగు పెట్టగానే అన్ని వైపులనుండీ చుట్టుముట్టేశారు వాళ్ళని!

అట్లా ఓ అంతర్రాష్ట్ర దొంగల ముఠా ఒకటి పోలీసుల చేత చిక్కింది. ఎంతో కాలంగా వెతుకుతున్న ముఠా దొరికినందుకు పోలీసు అధికారులు చాలా సంతోషపడ్డారు. పిల్లల్ని బలే మెచ్చుకున్నారు. కిడ్నాపర్లను విచారించి, వాళ్లు అంతకు ముందు ఎత్తుకెళ్ళిన పిల్లల వివరాలనూ సేకరించారు పోలీసులు. అట్లా ఇంకా చాలామంది పిల్లల్ని రక్షించిన వాళ్ళయ్యారు పవన్ బృందం.

ఆ ఏడాది పిల్లలు నలుగురికీ సాహస బాలుర మెడళ్ళు అందాయి.

**మా నాయనే!**

నవ్వు!

తండ్రి: గణితంలో ఎన్ని లెక్కలు ఇచ్చారురా, చింటూ?

కొడుకు: ఐదు ఇచ్చారు నాన్నా!

తండ్రి: ఐదేనా! వెరీ గుడ్! మరి అందులో ఎన్ని చేశావు?

కొడుకు: మొదటి మూడు, చివరి రెండు తప్ప అన్నీ చేసేశా నాన్నగారు!



# పరీక్షహాలులో..

*పరీక్షలే ఒక కష్టం అంటే, ఇక ఆపైన కోతి ఒకటి ! ఆలోచించి చూడండి ఎలా ఉంటుందో !*
*రచన: యస్. ప్రీప్తి , 9 వ తరగతి, ( బడి పేరు రాయటం మర్చిపోయింది :( )*

ఇవాళ్ళ సాంఘిక శాస్త్రం పరీక్ష.

"అయ్యో! నాకు చాలా భయంగా ఉంది- ఎలా రాస్తానో, ఏమిటో! పాసు కూడా అవుతానో లేదో?!.. నాకు చదువు తప్ప, వేరే ఆలోచనలన్నీ వస్తున్నాయి.. అయ్యో! ఇంకా ఐదు నిమిషాలే మిగిలాయి.. చదివినవి ఏవీ గుర్తుకు రావటం లేదు ఏంటి, నాకు?! అయ్యో, దేవుడా! నన్ను కాపాడు. ఈ పరీక్ష ఎలాగైనా పాస్ అయ్యేట్లు చెయ్, నేను పాసయితే నీ గుడికి వచ్చి, మూడో-నాలుగో కొబ్బరు కాయలు కొడతాను" అనుకుంటూ నేను బడిని చేరుకునేసరికి 'ఫూ-ఊ-ఊ' మంటూ విజిల్ వేశారు. పరీక్ష హాలు ఎక్కడుందో, ఏమో. ఇంకా చూసుకోనే లేదు నేను. టీచర్ గారు తిడుతున్నారు అందరినీ- "త్వరగా వెళ్ళండి!"అని కసురుతున్నారు-

"హమ్మయ్య! దొరికింది. ఒక్క గంతులో హాలును చేరుకున్నాను. కంగారు కంగారుగా నా నంబరు వెతుక్కొని కూర్చున్నాను. కూర్చొని తీరుబడిగా ఊపిరి పీల్చుకున్నానో, లేదో- ప్రశ్న పత్రం ఇచ్చేసారు. 35 ప్రశ్నలకు, 22 సమాధానాలు ఇవ్వాలట! మొదటి ప్రశ్నే ఇంత కష్టంగా ఉంది.. ఇంక మిగిలిన ప్రశ్నలకు జవాబులు ఎట్లానో..?!

అంతలో ఒక విచిత్రం జరిగింది- కిటికీ దగ్గరికి ఓ కోతి వచ్చింది!

ఇంక నా మనసు పరీక్షమీది నుండి దాని మీదికి పోయింది. నేను కోతినే చూస్తున్నాను. అది అక్కడే కొంతసేపు కూర్చొని, అటుపైన ఇటూ-అటూ తిరిగింది. చివరికి కిటికీలోకి చెయ్యి వేసింది. కిటికీ ప్రక్కనే కూర్చొని పరీక్ష రాస్తున్న ఒక అబ్బాయి చేతిలోంచి గబుక్కున పెన్ను లాక్కున్నది! వాడు 'ఓ..హేయ్!' అని అరిచి క్రింద పడిపోయాడు.

మిగిలిన పిల్లలంతా వాడికేసి చూసి, తర్వాత కోతి కేసి చూశారు. హాల్లో ఉన్న అయ్యవారు ఆ పిల్లాడి దగ్గరికి పరుగెత్తారు. నేను మటుకు కోతినే గమనిస్తున్నాను.. దాని ముఖం చూస్తే నవ్వొస్తోంది నాకు. అయితే హాల్లో ఇంక గందరగోళం మొదలైంది: పిల్లలంతా దాన్నే చూస్తూ దడపడిపోతున్నారు!

పరీక్ష రాసేందుకు వచ్చిన పిల్లలు చాలామంది క్యారేజీలు తెచ్చుకొన్నారు. ఏవేవో తిండి పదార్థాలు, పండ్లు తెచ్చుకొని, ఆ సామానునంతా గదిలో ఓ మూలన, తలుపు ప్రక్కగా పెట్టుకున్నారు.



కిటికీ దగ్గరనుండి బయలుదేరిన కోతి

ఇప్పుడు ఆ క్యారేజీల దగ్గరికి చేరుకున్నది. వాటి ప్రక్కనే కూర్చొని, మా అందరికేసీ చూడటం మొదలెట్టింది. నేను దానికేసి చేతులూపి 'హుష్.." అన్నాను. కోతి గబుక్కున నావైపు తిరిగి పళ్ళు చూపిస్తూ 'గుర్ర్.." మన్నది. ఇంక నేను ఏమీ అనకుండా మంచి పిల్లవాడిలా

అయిపోయాను.

అంతలో కోతి మెల్లగా వెనక్కి పోయింది. అందరి చూపులూ ఇప్పుడు దానిమీదే. అంతలో అది ఒక్కసారిగా కిటికీలో నుండి లోపలకి దూకింది! అందరూ భయపడి గందరగోళంగా లేచారు. కోతి తరగతి గది అంతా తిరుగటం మొదలెట్టింది. కూర్చొని ఎవరు రాస్తుంటే వాళ్ళ దగ్గరికి పోవటం మొదలెట్టింది. చివరికి అందరూ తమ తమ స్థానాల్లో నుంచి కదిలి ఒక మూలకి రావలసి వచ్చింది!

ఒకసారి 'అందరూ కదిలారు' అనిపించిన తర్వాత, కోతి మళ్ళీ ఓసారి క్యారేజీల దగ్గరికి చేరుకున్నది. ఇప్పుడది వాటిని అన్నింటినీ లాగి పడేయటం మొదలు పెట్టింది. బుట్టలలో ఆపిల్, అరటి, జామ పండ్లు ఏవేవో దొరికాయి దానికి. అన్నిటినీ కొరికి కొరికి పెట్టింది కొంతసేపు.

నాకింక కోతి మోజు తీరిపోయింది. పరీక్ష గుర్తొచ్చింది. నిజంగానే పరీక్ష సమయం గడిచిపోతున్నది. ఎట్లాగూ నేను అంతగా ఏమీ రాయలేదు: కోతిని త్వరగా బయటకు పంపేయాలి- లేకపోతే అసలు ఏమీ రాయలేను. దీన్ని ఎలాగో ఒకలాగా తరిమేయాల్సిందే..



ఈ ఆలోచన రాగానే నా చేతులు వాటంతట అవే అక్కడ ఉన్న మ్యాపు పాయింటరును పట్టుకున్నాయి. కోతి గబుక్కున నావైపు తిరిగి పళ్ళు నూరి, ఒక్కసారిగా నా మీదికి దూకింది. నేను లేచి, తలుపులోంచి బయటికి పరుగు పెట్టాను బుల్లెట్టు మాదిరి.

కోతి కూడా అంతే వేగంగా నావెంట పడింది! కోతినుండి తప్పించుకునేందుకు బయటికి పరుగెత్తనైతే పరుగెత్తాను గానీ, అది నా వెంట పడుతుందని ఊహించలేదు నేను. తీరా వెంట పడ్డాక నాకు అంతులేని భయం వేసింది. వెనక్కి వద్దామని చూస్తే హాలు తలుపులు వేసి ఉన్నాయి! ఒకసారి కోతి బయటికి వెళ్లగానే పరీక్ష హాలులోని అయ్యవారు గది తలుపులు వేయించేశారన్నమాట!

నేను ఆ కోతిని నా వెంట అటూ ఇటూ తిప్ప గలిగినంత తిప్పాను. ఇంక అలిసిపోతున్నాననేంతలో నాకు మా పరీక్ష హాలు కిటికీ కనబడింది: అది ఇంకా తెరిచే ఉన్నది! నేను ఇంక ఏమీ ఆలోచించలేదు- ఒక్కసారిగా కిటికీ లోంచి గదిలోకి దూకేసి, వెంటనే కిటికీ తలుపు మూసేశాను!

హాల్లో ఉన్నవాళ్లంతా చప్పట్లు కొట్టి నన్ను మెచ్చుకున్నారు. అయ్యవారు కూడా నాకేసి నవ్వుతూ చూశారు. ఇంక అప్పుడు వగరుస్తూ పరీక్ష రాసేందుకు కూర్చున్నాను. ఇంకా ఒక్క గంట సమయం మిగిలి ఉన్నదేమో మరి- కానీ ఆశ్చర్యం, నాకు మటుకు అన్ని ప్రశ్నలకూ జవాబులు గుర్తుకొచ్చేశాయి! ఏనాడూ రాయనంత బాగా రాసేశాను, సాంఘిక పరీక్ష! మరి నాకు ఆ పరీక్షలో ఎన్ని మార్కులొచ్చాయో తెలుసా? 87! కోతి చేసిన మేలంటే ఇదే, మరి!

**మెదడుకు మేత సమాధానాలు**

1. బాటిల్(సీసా)
2. దీపం
3. మద్దెల
4. కొవ్వొత్తి

**కుక్కకాటుకు చెప్పుదెబ్బ!**

కోపిష్టి భర్త: ఇది మనుషులు తినే తిండి కాదు.

కోపిష్టి భార్య: అందుకేగా మీకు పెట్టింది.

**నవ్వితే నవ్వండి**

బిచ్చగాడు: అమ్మా! బిచ్చం తల్లీ.

ఇల్లాలు: అక్కడ పెట్టి వెళ్ళు బాబూ!



# వేటగాడి శవయాత్ర

*కథ రాయమని కొత్తపల్లి-70 లో ఇచ్చిన ఈ బొమ్మ గుర్తొచ్చిందా? దానికి సరిపోయేట్లు కథ రాసి పంపింది శర్వాణి- చదవండి. ఇంతకంటే మంచి కథ మీరేమన్నా రాస్తారేమో, రాసి పంపండి త్వరగా !*

*రచన : S. V. అనన్య శర్వాణి, ఆరవ తరగతి, సర్. సి. ఆర్. పబ్లిక్ స్కూల్, ఏలూరు.*

అనగనగా ఒక అడవి ఉండేది. ఆ అడవిలో ఎన్నో చెట్లు, మొక్కలు, రకరకాల జంతువులు, పక్షులు ఉండేవి. ఆ జంతువులు, పక్షులు అన్నీ కూడా చాలా కలిసి మెలిసి ఉండేవి. వాటి స్నేహం గురించి తెలిసిన ఊరి వాళ్లెవరూ ఆ అడవి జోలికి పోయేవాళ్ళు కాదు.

అయితే ఒకరోజున సాంబయ్య అనే వేటగాడు ఒకడు పారుగూరు నుండి వచ్చాడు. జంతువులను వెతుక్కుంటూ తిరుగుతున్న అతనికి అకస్మాత్తుగా ఒక జింక కనిపించింది. వెంటనే విల్లు ఎక్కుపెట్టి దాన్ని కొట్టబోయాడు వాడు. అయితే అంతలోనే ఎక్కడనుంచి వచ్చిందో, ఒక పాము అతనిని చటుక్కున కాటు వేసింది!

దాంతో సాంబయ్య కాస్తా నురగలు

కక్కుకుంటూ క్రింద పడి చనిపోయాడు. అది చూసిన మిగతా జంతువులు, పక్షులు చాలా సంతోషపడ్డాయి. అవన్నీ పాముకి కృతజ్ఞతలు చెప్పుకొని, సన్మానం చేసాయి.

అయితే వేటగాడి శవం ఇంకా అక్కడే పడి ఉన్నది. దానినిండా విషం ఉన్నదాయె- దాన్ని వేరే ఏ జంతువూ పొరపాటున కూడా తినకూడదు! మరేం చేయాలి..? చివరికి నక్క అన్నది, "మిత్రులారా! మనుషులు శవాలను ఊరేగించి, పూడ్చిపెడతారు- తెలుసు కదా?! మనం కూడా వీడి శరీరాన్ని అలా చెయ్యాలి" అని.

జంతువులన్నీ సరేనన్నాయి. "కానీ శవయాత్ర కోసం పల్లకీ లేదే, మన దగ్గర?!" అనుమానం వ్యక్తం చేసింది ఎలుగుబంటి.

కుందేలు అన్నది- "అది పెద్ద సమస్య కాదులెండి. వడ్రంగి పిట్టను అడిగి చెక్కను కొయ్యమందాం. చెద పురుగులూ, వడ్రంగి పిట్టా కలిసి పల్లకీని కూడా చేసి పెడతాయి. నిన్ననే నాకొక మంచి పట్టు బట్ట దొరికింది. దాన్ని ఆ పల్లకీకి రెండు వైపులా కట్టేందుకు వాడుకుందాం. ఎలుకలు, పందికొక్కులూ గుంతను త్రవ్వి పెడతాయి. రేపోసారి అందరం కలిసామంటే మజా మజాగా పల్లకీ యాత్ర కానివ్వచ్చు" అని.

వడ్రంగి పిట్టకు, చెద పురుగులకు, ఎలుకలకు పని అప్పజెప్పాక, జంతువులన్నీ వేటి ఇళ్ళకు అవి వెళ్ళిపోయాయి.

మర్నాడు వేటగాడి శవయాత్ర 'ధూం-ధాం'గా మొదలయ్యింది. నాలుగు దుప్పులు నాలుగువైపులా పల్లకిని పట్టుకున్నాయి. కొన్ని జంతువులు ముందు, కొన్ని జంతువులు వెనకా ఠీవిగా నడిచాయి. నక్కలు, తోడేళ్ళు ఊళలు వేశాయి. వేటికవి బాకాలు ఊది సందడి చేశాయి. ఒకవైపున వాటన్నిటికీ నవ్వు వస్తోంది- అయినా నవ్వకూడదన్నట్లు అన్నీ గంభీరంగా ముఖాలు పెట్టుకొని తిరిగాయి. అట్లా వేటగాడి శవాన్ని అడవి అంతటా తిప్పి, చివరికి పూడ్చేసి, అన్నీ హాయిగా నవ్వుకున్నాయి. వేటగాడి శవయాత్ర విజయవంతమైంది! 

# టింగుడు బిళ్ళ

బొమ్మల కథ

*ఆంధ్రదేశంలో ఒకనాడు పిల్లలందరూ మెచ్చారు ఈ కథని. ఇన్నేళ్ల తర్వాత కూడా, ఏంటో విచిత్రం, ఈ పిచ్చి కథ ఇంకా నడుస్తూనే ఉంది !*
*కథనం : యన్. లేహ్య, మూడవ తరగతి, M.P.P. స్కూల్, దాసరి వీధి, గుత్తి.*

అనగనగా ఒక ఊళ్ళో ఒక అవ్వ ఉండేది. అవ్వకు ఒక మనుమడు ఉన్నాడు. వాడి పేరు బాబు. బాబు చాలా దుబ్బగా ఉండేవాడు.



కొన్నేళ్లకి బాబు స్కూలుకి వెళ్ళాడు. స్కూల్లో పిల్లలందరికీ వాడిని చూడగానే 'దుబ్బోడి పాట' గుర్తుకొచ్చింది:

**దుబ్బోడమ్మా దుబ్బోడు**

**దుబ్బ బిస్కెట్ తిన్నాడు**

**ఇంకా కావాలన్నాడు**

**అమ్మకు కోపం వచ్చింది**

**మూడు గుద్దులు గుద్దింది**

అని పాడటం మొదలు పెట్టారు.

బాబుకి ఏడుపొచ్చింది. ఇంటికి పరుగెత్తి అవ్వకు చెప్పాడు- "వీళ్లంతా నన్ను ఎట్లా ఏడిపిస్తున్నారో చూడు' అన్నాడు.

అవ్వకు మంత్రాలొచ్చు. ఆమె ఆలోచించింది. ఎవరైనా నిన్ను 'దుబ్బోడు' అన్నారనుకో, అప్పుడు నువ్వు వాళ్ళని 'టింగుడు బిళ్ళ' అని పిలువు. ఇంక వాళ్ల పని ఏమౌతుందో చూడు అని చెప్పింది.






ఆ మరుసటి రోజు బాబు స్కూలుకి వెళ్ళగానే పిల్లలు చాలామంది 'దుబ్బోడా-దుబ్బోడా' అన్నారు ఎగతాళిగా. బాబు కోపంతో పళ్ళు బిగించి "ఈ పిల్లలందరూ టింగుడు బిళ్ళ" అన్నాడు. అనగానే అందరూ మాయపోయారు!

బాబుకి సంతోషం వేసింది. గబగబా ఇంటికి వచ్చి అవ్వకి ఈ సంగతి చెప్పాడు.





అవ్వ సంతోష పడ్డది. 'మా నాయనే, ఎంతమంచి పని చేశావు!' అని మెచ్చుకున్నది వాడిని.

అంతలో బాబుకి ఆకలైంది. జిలేబి గుర్తుకొచ్చింది. 'జిలేబి కావాలి' అని అవ్వని అడిగాడు. 'లేవు దుబ్బోడా! అయిపోయినాయిరా దుబ్బోడా!' అన్నది అవ్వ, అలవాటుగా.

'దుబ్బోడు' అని వినగానే బాబుకి కోపం వచ్చేసింది. 'ఈ అవ్వే టింగుడు బిళ్ళ!' అన్నాడు గబుక్కున. దాంతో అవ్వ కూడా చటుక్కున మాయమైపోయింది.





అంతలో స్కూలు పిల్లల తల్లిదండ్రులంతా వచ్చి బాబు ఇంటి ముందు మూగారు.

'ఏమిరా దుబ్బోడా! మా పిల్లల్ని ఎలా మాయం చేశావురా? మా పిల్లల్ని తిరిగి రప్పించరా!' అన్నారు.

'దుబ్బోడు' అన్న మాట వినిపించగానే బాబుకి కోపం వచ్చేసింది. వాళ్ళకేసి చూసి

చేతులు తిప్పుతూ 'వీళ్లంతా టింగుడు బిళ్ళ' అన్నాడు. అంతే! వాళ్లంతా మాయమ్మైపోయారు!

అంతలో బాబు బంధువులంతా వచ్చారు అక్కడికి. 'ఏంటిరా దుబ్బోడా! అవ్వకు ఏమ్మైందిరా?' అన్నారు. దుబ్బోడు యథాప్రకారమే 'ఈ బంధువులంతా టింగుడు బిళ్ళ' అనేశాడు. వాళ్లంతా కూడా మాయం అయిపోయారు.



ఇంక అప్పుడు బాబు ఒక్కడే అయిపోయాడు. వాడికి తెలిసినవాళ్లంటూ ఎవ్వరూ లేకుండా పోయారు. దాంతో వాడికి చాలా దిగులు వేసింది. వెళ్ళి అద్దంలో తనని తాను చూసుకొని ఏడ్చాడు.

'ఇంక నువ్వు ఒక్కడివే మిగిలివున్నావు, ఎందుకు? నువ్వు కూడా టింగుడు బిళ్ళ అయిపోరాదూ?' అనుకున్నాడు. అంతే! మరుక్షణం వాడు కూడా మాయమ్మైపోయాడు!

**ఓసారి చాలు!**

నవ్వు!

లత: పిన్నీ! బాబాయ్ ఈ మధ్య అలా చిక్కి పోయారేంటి?

పిన్ని: ఏమోనమ్మా! అక్కడికీ రోజుకోసారైతే భోజనం పెడుతూనే ఉన్నా మరి!



# పరివర్తన

రచన: రాధ మండువ



సిరిపురంలో గోవిందుడు అనే యువకుడు ఉండేవాడు. వాడు చిన్నప్పటినుండే దొంగతనాలకు అలవాటుపడ్డాడు. ఎవరికీ పట్టుబడకుండా ఎంతో ఉపాయంగా దొంగతనాలు చేసేవాడు. వాడిని పట్టుకోవడానికి ఎంతో మంది ప్రయత్నించినా లాభం లేకపోయింది. ఈ విషయం ఆనోటా ఈనోటా ప్రాకి రాజు గారికి తెలిసింది.

రాజు రంగనాధుడు దయార్ద్ర హృదయుడు. ఇలాంటి వారిని ఎంతో మందిని మంచి వారిగా మార్చాడు. రాజు గారికి వీడి విషయం తెలిసిన మరునాడే వాడిని పట్టుకు రమ్మని భటులను పంపాడు. భటులను పంపుతున్న విషయాన్ని ముందుగానే ఆ

ఊరి ప్రజలకు, గోవిందుడికీ తెలిసేట్లు చేశాడు.

భటులు ఊళ్ళోకి వచ్చారన్న వార్త విని గోవిందుడు పారిపోసాగాడు. పథకం ప్రకారం రాజభటులు గోవిందుడిని చంద్రగిరి అడవుల్లోకి వెళ్ళేట్లు తరిమి కొట్టారు. "ఆడవిని జాగ్రత్తగా దాటితే నందపురం చేరుకోవచ్చు" అనుకుంటూ వడివడిగా నడవసాగాడు గోవిందుడు.

సాయంత్రం అయింది. చీకట్లు ముసురుకుంటున్నాయి. అలిసిన గోవిందుడు రాత్రికి విశ్రాంతి తీసుకోవడం కోసం ఎత్తైన చెట్టుని ఎక్కబోతుండగా "ఎవరురా నువ్వు?! ఎందుకు, నా చెట్టును ఎక్కుతున్నావు?" అన్న మాటలు వినిపించి భయంగా క్రిందకు చూశాడు. చెట్టు క్రింద ఒక భయంకరాకారుడు నిలబడి ఉన్నాడు.

భయం వల్ల గోవిందుడికి నోట మాట రాలేదు. "భయపడకు. చెట్టు దిగిరా! నేను నిన్నేమీ చేయను" అన్నాడా భయంకరాకారుడు.

గోవిందుడు చెట్టు దిగి వచ్చాడు.

"ఎవరు నువ్వు? ఈ అడవిలోకి ఎందుకు వచ్చావు?" అడిగాడు ఆ భయంకరాకారుడు.

"నేను ఒక దొంగను. రాజ భటులు నన్ను ఈ అడవిలోకి తరిమారు" అన్నాడు గోవిందుడు వణికిపోతూ.



"భయపడకు. నేను ఒక రాక్షసుడిని. ఎప్పుడూ ఇక్కడే తిరుగుతుంటాను. ఈ చెట్టు నా నివాసం. నేను నీకు కొంత డబ్బు

ఇస్తాను. దొంగతనాలు మానేసి వ్యాపారం చేసుకుని బ్రతుకుతావా?" అని అడిగాడు భయంకరాకారం.

"ఇప్పటికే సగం చచ్చి ఉన్నాను. ఇక దొంగతనాలు చేయను. నువ్వు చెప్పినట్లే వ్యాపారం చేసుకుని బ్రతుకుతాను" అన్నాడు గోవిందుడు సంతోషంగా.

భయంకరాకారుడు ఆ చెట్టు తొర్రలోంచి పెద్ద డబ్బు మూట తీసాడు. అందులోంచి కొంత డబ్బుని తీసి గోవిందుడి చేతికి ఇస్తూ "చెట్టెక్కి పడుకుని రేపు ఉదయాన్నే ఇక్కడి నుండి వెళ్ళు" అని మిగిలిన డబ్బు మూటను తిరిగి తొర్రలో ఉంచి, చీకట్లోకి దూకి మాయమయ్యాడు.

భయంకరాకారం తన చేతికి ఇచ్చిన డబ్బు అంత సంతోష పెట్టలేదు గానీ; అతను తిరిగి తొర్రలో పెట్టిన డబ్బు మూటను చూడగానే మటుకు గోవిందుడి కళ్ళు మెరిశాయి. 'మొత్తం డబ్బునీ ఎలా కాజేయాలా' అని అలోచనలతో రాత్రంతా గడిపాడు వాడు. ఉదయాన్నే లేచి 'ఆ తొర్రలో డబ్బు మూట ఉందా లేదా' అని చూడాలనుకున్నాడు; కానీ ధైర్యం చాలక, అక్కడ నుండి వెళ్ళిపోయాడు.

అట్లా నందపురం చేరిన గోవిందుడు నేరుగా తనకు తెలిసిన ఓ మాంత్రికుడి దగ్గరికి వెళ్ళాడు. తనకు రాక్షసుడు ఇచ్చిన డబ్బునే ఎరవేసి, ఆ రాక్షసుడిని ఆ అడవిలోంచి పారద్రోలమని ఒప్పందం కుదుర్చుకున్నాడు. ఆ మాంత్రికుడిని తను అంతకు ముందు పడుకున్న చెట్టు వద్దకు తీసుకు వచ్చాడు. మాంత్రికుడు చాలాసేపు ఏవేవో మంత్రాలు చదివి; 'రాక్షసుడిని పారద్రోలానురా! వాడు ఇక నిన్ను పీడించడు" అని చెప్పి డబ్బులు పుచ్చుకుని వెళ్ళిపోయాడు.

మాంత్రికుడు అటు వెళ్ళగానే ఇటు తొర్రలో చేయి పెట్టి డబ్బు మూటను బయటకు తీశాడు గోవిందుడు. సంతోషంతో పరుగు పరుగున ఇంటికి చేరి మూట విప్పాడు. మూటలో నుండి తేళ్ళు, ఎండ్రకాయలు బయటపడి ఇల్లంతా పాకటం మొదలు పెట్టాయి! భయంతో అరుస్తూ ఇంటి

బయటకు పరిగెత్తిన గోవిందుడిని వాకిట్లోనే నిలబడి ఉన్న భటులు బంధించి రాజు గారి దగ్గరకు తీసుకువెళ్ళారు.



అప్పటికే పూర్తిగా చచ్చిన గోవిందుడు రాజు గారి కాళ్ళపైన పడి 'రాక్షసుడిని కూడా మోసం చేశాన'ని ఒప్పుకున్నాడు. వాడు పూర్తిగా మారిపోయాడని గ్రహించిన రాజుగారు "వ్యాపారం చేసుకుంటానని డబ్బు తీసుకున్నావు; కానీ డబ్బు మూటను చూడగానే నీ పాత అలవాటుని మానుకోలేకపోయావు. నీలో మార్పు తీసుకు రావాలనే నా మనిషిని రాక్షసుడిలా నటించేట్లు చేశాను. ఇకనైనా ఆ పాడు బుద్ధిని మానుకుని వ్యాపారం చేసుకో" అంటూ కొంత డబ్బుని వాడి చేతిలో ఉంచాడు.

సిగ్గుతోటీ, కృతజ్ఞతతోటీ తల దించుకున్నాడు గోవిందుడు. అటుపైన ఉన్న ఊళ్ళోనే అంగడి పెట్టుకుని మంచి పేరు సంపాదించుకున్నాడు అతను.

**మొబైల్ కష్టాలు!**

రాము: టైం పొద్దున పది అయితే రాత్రి పదిగా మార్చావేంటి?

వెంగళప్ప: నా ఫోన్ లో నైట్ బ్యాలెన్సు ఉంది కదా, మాట్లాడుదామని!

నవ్వు!

**ప్రార్థన రహస్యం!**

రోహిత్: నువ్వు తినే ముందు ప్రార్థిస్తావా?

రాజు: లేదు, మా అమ్మకు వంటలు వచ్చు.



# తీరిన కష్టం

రచన: సి.ప్రణయజ,(ప్రిన్సిపల్) , శ్రీ వెంకటేశ్వర బాల కుటీర్, బ్రాడీపేట, గుంటూరు.

రాణి సౌభాగ్యలక్ష్మీదేవికి తోటలంటే ప్రాణం. అంత:పురం వెనకాల పెద్ద ఉద్యానవనం ఒకటి వేయించారావిడ. తోటనిండా పసుపు బంతులు, చేమంతులు, తెల్లని లిల్లీలు, నందివర్ధనాలు, ఎర్ర గులాబీలు, మందారాలు, సువాసనలు విరజిమ్మే మల్లెలు, విరజాజులు, మాలతీలు. ఇవేకాక కనకాంబరాలు, ప్రొద్దుతిరుగుళ్లు, కలువలు, తామరలు- ఇంకా ఎన్నో. పూల మొక్కలు, పండ్ల చెట్లు, కూరగాయల మొక్కలు. ధరణి తల్లికి అలంకరించిన విరి హారం, ఆ తోట.

రంగు రంగుల సీతాకోక చిలుకలు, తేనెటీగలు, తుమ్మెదలు ఆ తోటలోని పూలతో ఆటలాడుకునేవి. ఆ చెట్ల జాడల్లో రకరకాల పక్షులు, జంతువులు సేదతీరేవి.

ప్రతిరోజూ ఉదయం రాణిగారు పూల-తోటలోని మొక్కలతో మాట్లాడుతూ, వాటిని స్పృశిస్తూ కాలం గడిపేవారు. రాణిగారి రాక కోసం రోజూ పూలన్నీ ఎదురుచూసేవి. అయితే ఆ రోజున రాణిగారికి ఏదో పనుందట. ఆవిడ తోటకు రావట్లేదు: ఈ సంగతి తెలిసిన పూలన్నీ చిన్నబోయాయి.

ఇంతలో పడమరనుండి చల్లని పిల్లతెమ్మెర వీచింది. పూలన్నీ ఒక్కసారిగా పులకించి పోయాయి. మొక్కలు కులాసాగా అటూ ఇటూ ఊగాయి. ఒకదానిని ఒకటి మృదువుగా తాకుతూ గుసగుస-లాడుకున్నాయి.

**పువ్వులం మేం పువ్వులం**

**బంతులం, చేమంతులం**

**మల్లెలం, మందారాలం**

**కలువలం, తామరలం**

**ఆకూ-ఆకు తాకుకుంటూ**

**ఆనందంగా ఊగుతాం**

అంటూ పాడసాగాయి. ఆ ఆనందంలో జంతువులు, పక్షులు, తేనెటీగలు, సీతాకోక చిలుకలు అన్నీ పాల్గొంటున్నాయి-

అంతలో కెవ్వున ఒక కేక వినబడింది వాటికి- అన్నీ ఉలిక్కిపడి అటు వైపుకు చూశాయి- భయంతో కంపించి పోయాయి. చిన్న రాకుమారుడు సురేంద్ర వర్మ అటుకేసి వచ్చి, విరిసీ విరియని మొగ్గతో ఉన్న చిన్ని పొద్దు తిరుగుడు మొక్కను చటుక్కున పీకేశాడు! చిన్ని మొక్క బాధతో అరిచిన అరుపు అది!

పీకిన ఆ మొక్కను దూరంగా విసిరేశాడు సురేంద్రవర్మ, వెటకారంగా నవ్వుతూ. ఆ మొక్క కాస్తా సొమ్మసిల్లి పడిపోయింది!

అప్పటివరకూ కిలకిల నవ్వుతూ, పాటలు పాడుతున్న పూల మొక్కలన్నీ విలవిల లాడిపోయాయి. ఏడుస్తూ చిన్ని మొక్క వైపుకు బాధగా చూశాయి- ఏమీ చేయలేక.

వెంటనే చీమలు రంగంలోకి దిగాయి. ఈ విషయం రాణిగారికి చెప్పాలని ఒకదాని వెనుక ఒకటి వరుసగా అంత:పురం వైపుకు పరుగు పెట్టాయి. వాటి వెనుక తుమ్మెదలు,

ఆ వెనుక తేనెటీగలు, సీతాకోక చిలుకలు, పురుగులు, ఆపై పక్షులు, కుందేళ్లు, జింకలు. కానీ అంత:పురం తలుపులు మూసి ఉన్నాయి. వీళ్లెవ్వరికీ అక్కడ ప్రవేశం లేదు!

ఎప్పుడూ రాత్రివేళ వేళ తప్పిస్తే బయటికిరాని గుడ్లగూబ తాతయ్య ఆనాడెందుకో డాక్టరు తులసమ్మ దగ్గరకు వెళుతున్నాడు. వీళ్లందరినీ చూసి, ఏమిటని అడిగాడు.

"తాతా! ఈ చిన్ని మొక్కను చిన్న రాకుమారుడు నిష్కారణంగా పీకేశాడు. అది ఎట్లా సొమ్మసిల్లి పడిపోయిందో చూడు! ఈ విషయం రాణిగారికి చెబుదామంటే అంత:పురం తలుపులు మూసి ఉన్నాయి. ఏదైనా ఉపాయం ఉంటే చెప్తావా?" దిగాలుగా అడిగాయి అన్నీ.

గుడ్లగూబ తాతయ్య కొంచెం ఆలోచించాడు. "దానిదేముంది, సులభం. పెద్దకళ్ళ కోతిపిల్ల ఎక్కడుంది?" అడిగాడు. జంతువులన్నీ పెద్దకళ్ళ కోతిపిల్లను ముందుకు తోశాయి. గుడ్లగూబ తాతయ్య దాని చెవిలో ఏదో గుసగుస చెప్పాడు.



అంతే- అది ఎగిరి గంతేసి, కొమ్మల పైకి ఎక్కుతూ, అంత:పురం గోడపైకి దూకింది. గది-గది చూసుకుంటూ రాణిగారి గదిని కనిపెట్టింది. లోపలికి వచ్చేసిన కోతిపిల్లని చూసి చెలికత్తెలు అటు ఇటూ పరుగులు తీశారు. కూర్చొని ఉన్న రాణిగారి చెయ్యి పట్టుకుని లాగింది కోతిపిల్ల. ఉలిక్కిపడి లేచి, ఆశ్చర్యంగా దానివైపుకు చూశారు రాణిగారు.

మళ్ళీ మళ్లీ రాణిగారి చేతిని లాగుతూ, కిటికీ పైకి ఎగిరింది కోతిపిల్ల. ఆమెకు అర్థం

కాలేదు. లేచి, ఏమిటా అని కిటికీ లోంచి బయటికి చూశారు. చిన్ని చీమ నుండి పెద్ద ఏనుగు వరకూ అన్నీ ఆమెకోసం బారులు తీరి వేచి చూస్తున్నాయక్కడ!



రాణిగారు గబగబా బయటికి వచ్చారు. సొమ్మసిల్లి పడిపోయిన చిన్ని పొద్దుతిరుగుడును ఆమెకు చూపించింది కోతిపిల్ల. రాణిగారి గుండె కరిగి పోయింది. మొక్కను మెల్లగా చేతిలోకి తీసుకుని ఆప్యాయంగా తడిమింది. తోటమాలులను పిలిచి మొక్కను చూపించింది.

రంగయ్య గాబరా పడ్డాడు. "అమ్మా, మేం పీకలేదు ఆ మొక్కను. ఇందాక.." అన్నాడు కంగారుగా .

“ఊఁ..ఇందాక..?”

“ఇందాక.. చిన్న యువరాజావారు..”

"ఓహోఁ అదా సంగతి! సరే, వారికి నేను చెబుతాను. ఇకపై ఎప్పుడూ మొక్కల్ని ఇలా చెయ్యొద్దని చెబుతాను. ముందు నువ్వు దీన్ని నీడలో నాటు. దానికి ఏమీ కాకుండా జాగ్రత్త తీసుకో" హుకుం జారీ చేశారు రాణిగారు.

రంగయ్యకు మొక్కలనాడి బాగా తెలుసు. చిన్ని మొక్కకు చేయవలసిన చికిత్సలన్నీ చేశాడు. మూడు రోజుల తర్వాత చిన్ని మొక్క తిప్పుకుని లేచి నిటారుగా నుంచుంది.

రాణిగారు వచ్చి చూశారు. చిన్ని మొక్కకు, బుల్లిపువ్వుకు చిన్న ముద్దిచ్చారు. పూలన్నీ సంతోషంతో కిలకిల నవ్వాయి. అన్నీ ఆమె వైపుకు వంగాయి- తమకూ ముద్దివ్వమని!





# కలలు

ఆంగ్ల కథ

*మూలం : అజ్ఞాత రచయిత* *అనుసరణ : నారాయణ*

నాకో మిత్రుడున్నాడు- మాంటీ రాబర్ట్స్. అతను చాలా ధనవంతుడు. సాన్‌సిడ్రో పట్టణానికి ఆవల, 200 ఎకరాల పచ్చిక భూమి ఒకటి ఉంది అతనికి. అందులో అతను గుర్రాలను పెంచుతాడు!

మేలుజాతి అరేబియన్ గుర్రాలనుండి మామూలు పొట్టి గుర్రాలవరకూ రకరకాల గుర్రాలు పెరుగుతుంటాయి అతని దగ్గర. వాటికన్నిటికీ అతను శిక్షణనిచ్చి, పందెపు గుర్రాలుగా తయారు చేస్తుంటాడు. ఒక్కో గుర్రాన్నీ పందాల వాళ్ళు లక్షల రూపాయలిచ్చి కొనుక్కుపోతుంటారు!

నేను ఒక్కోసారి గ్రామాలకు వెళ్ళి, యువకులకు ఉత్సాహాన్ని కలిగించే పనులేవైనా చేసి వస్తుంటాను. అలాంటప్పుడు మాంటీ నాకు తన గుర్రాన్నిచ్చి పంపించటమే కాకుండా, దానికి అయ్యే ఖర్చుల్ని కూడా తనే భరిస్తుంటాడు.

ఒక మామూలు గుర్రాల వ్యాపారికి ఇట్లాంటి మంచి బుద్ధి ఎందుకొచ్చిందో నాకు మొదట్లో అర్థమయ్యేది కాదు- ఓసారి నన్ను తన మిత్రులకు పరిచయం చేస్తూ అతను

ఇలా చెప్పేంతవరకూ- ఇది విన్నాక నాకు అతను బలే నచ్చాడు:



"చాలా ఏళ్ళ క్రితం ఒక కుర్రాడు ఉండేవాడు. వాళ్ల నాన్న గుర్రాలకు శిక్షణనిచ్చేవాడు: 'ఒక చోట' అని కాకుండా, ఎవరి దగ్గర పని ఉంటే వాళ్ల దగ్గర పని చేసేవాడు- ఒక గుర్రపు శాల అనక, ఒక ఊరనక, ఒక పందెపు ట్రాక్ అనక, ఒక పొలం అనక- ఎక్కడ పని ఉంటే అక్కడికల్లా తిరుగుతూ ఉండేవాడు. దానివల్ల అతని కొడుకు చదువులు ఎక్కడా సరిగ్గా సాగకుండా అయ్యింది. ప్రతి బడిలోనూ అతనికి 'మొద్దు' అని పేరొచ్చింది..

"ఒకసారి అతను చదివే బడిలో మాస్టారు వీళ్ల తరగతి పిల్లలకు ఒక అసైన్‌మెంటు ఇచ్చారు- 'పెద్దయిన తర్వాత ఏమవుతావు, ఏం చేస్తావు?' అని వివరంగా రాసి ఇవ్వాలి.

"ఈ కుర్రాడు ఆ రోజు రాత్రంతా కూర్చొని, తను పెద్దయ్యాక ఏం చేద్దామను-కుంటున్నాడో ఏడు పేజీల్లో రాశాడు: 'గుర్రాల్ని మేపే పచ్చిక బయలుకు యజమాని అవుతాడు తను!'.

తన కలని అతను చాలా స్పష్టంగా వివరించాడు కూడా- తను ఏ 200 ఎకరాల పచ్చిక భూమికైతే యజమాని అవ్వాలనుకుంటున్నాడో, ఆ భూమి బొమ్మకూడా గీసాడు; అందులో ఏ భవనం ఎక్కడ ఉండబోతున్నదో గీసి చూపాడు; ఏ గుర్రపుశాల ఎటువైపున ఉండబోతున్నదీ చూపాడు; ఆ రెండొందల ఎకరాల కలల పచ్చికభూమిలో ఉండబోతున్న 4000 చదరపు అడుగుల ఇంటి ప్లాను కూడా

గీసేసాడు! ఈ పని చేస్తున్నప్పుడు అతను అందులో తన హృదయాన్ని సంపూర్ణంగా ఆవిష్కరించాడు. తర్వాతి రోజున ఉత్సాహంగా తను చేసిన ఆ అసైన్‌మెంటును తీసుకెళ్ళి మాస్టారికి అందించాడు.



రెండు రోజుల తర్వాత అతని అసైన్‌మెంటు అతనికి తిరిగి ఇవ్వబడింది- అసైన్‌మెంటు మొదటి పేజీలో ఎర్ర ఇంకుతో పెద్ద F రాసి ఉన్నది. "క్లాసు ఐపోయాక నన్ను కలు" అని కూడా రాసి ఉన్నది క్రింద!

కలకన్న ఆ కుర్రాడు క్లాసు ఐపోగానే వెళ్ళి మాస్టారిని కలిసాడు: 'నాకు F గ్రేడు ఎందుకిచ్చారు?' అని అడిగాడు.

మాస్టారు అన్నారు: "ఎందుకంటే అది పూర్తిగా అసంబద్ధంగా ఉంది గనక. నీలాంటి కుర్రవాడికి ఏమాత్రం సాధ్యం కాని కల అది! చూడు- నీ దగ్గర డబ్బు లేదు. మీ నాన్న దేశ ద్రిమ్మరి- నిలకడ లేని కుటుంబం మీది. నీ దగ్గర వనరులేవీ లేవు. గుర్రాల్ని మేపే పచ్చిక బయలు అంటే ఎన్ని డబ్బులో కూడా నీకు తెలీదు. పిల్లల్ని కనే జాతి గుర్రాలను కొనుక్కోవాలి మొదట- దానికి కూడా నీ దగ్గర డబ్బు లేదు. ఇక ఆ తర్వాత పెద్ద గుర్రాలకు శిక్షణనిచ్చేందుకు ఫీజులూ చెల్లించాల్సి వస్తుంది. ఆ డబ్బూ లేదు- నువ్వు నీ కలని తీర్చుకొనే అవకాశం అసలైతే సున్న!"

"నువ్వు నీ కలని తిరగరాయాలి- మరింత వాస్తవికంగా ఉండే అంశం ఏదైనా ఎంచుకో. అప్పుడు మరి, నీ గ్రేడును మార్చగలనేమో చూస్తాను"

ఆ కుర్రాడు ఇంటికి వెళ్ళి మాస్టారు చెప్పిన

దాన్ని గురించి దీర్ఘంగా ఆలోచించాడు. అతని ఆలోచనలు ఎంతకీ తెగలేదు. వాళ్ల నాన్నని సలహా అడిగితే ఆయన "చూడు నాయనా! ఈ విషయంలో నువ్వు జాగ్రత్తగా ఆలోచించిగానీ ఏ నిర్ణయమూ తీసుకునేందుకు లేదు. ఏలాంటి నిర్ణయం తీసుకున్నా ముందు మనసును బాగా గట్టిచేసుకో" అని ఊరుకున్నాడు.

చివరికి, ఒక వారం రోజులు ఆలోచించాక, పిల్లవాడు తను అంతకు ముందు రాసిన అసైన్‌మెంటునే- ఒక్క మార్పు కూడా చేయకుండా- తీసుకెళ్ళి మాస్టారికి అందిస్తూ చెప్పాడు- "మీరు మీ F గ్రేడును అలాగే ఉంచుకోండి; నేను నా కలని అలాగే ఉంచుకుంటాను" అని.

అక్కడ చేరిన మిత్రులకు ఈ కథని చెబుతూ మాంటీ రాబర్ట్స్ అన్నాడు-"మీకు ఈ కథని ఎందుకు చెబుతున్నానంటే, మీరంతా ఇప్పుడు, ఇదిగో- నా 200 ఎకరాల గుర్రాలశాల మధ్య, నా 4000 చదరపు అడుగుల సొంత ఇంట్లో కూర్చొని ఉన్నారు గనక!

ఆనాడు నేను మా మాస్టారుకి ఇచ్చిన అసైన్‌మెంటు ప్రతిని ఫ్రేం కట్టించి పెట్టుకున్నాను- ఆ గోడకు వేలాడుతున్నది అదే" అని.



ఈ సంగతి చెప్పి, అతను ఒక గ్లాసెడు నీళ్ళు త్రాగి, తన కథని కొనసాగించాడు-

"కొసమెరుపు ఏంటంటే, రెండేళ్ల క్రితం అదే మాస్టారు ఓ ముప్ఫై మంది పిల్లల్ని వెంట వేసుకొని వచ్చి, నా పచ్చిక బయలులో ఒక వారం రోజులు క్యాంపు ఉన్నాడు.

వెళ్తూ వెళ్తూ ఆయన తన మనసులో

ఇంతకాలం దాచుకున్న రహస్యాన్ని చెప్పేశాడు- 'చూడు మాంటీ! నేను నీకు పాఠాలు చెప్పిన ఆ కొద్ది సంవత్సరాల కాలంలో నేను చాలా మంది పిల్లల కలల్ని దోచుకున్నాను. వాళ్ళ కలల స్థానంలో అర్థం లేని వాస్తవిక ఆలోచనల్ని చాలా వాటిని నింపి పెట్టాను. నువ్వు నీ కలని నాకు దోచిపెట్టకుండా ఆపుకోగలిగావు. అంత స్థైర్యమూ, ఊహా నీకుండటం నిజంగా నీ అదృష్టం. లేకపోతే నువ్వు.. ' అని ఆగాడు.

అందుకనే చెబుతాను- "మీ కలల్ని మీరే ఉంచుకోండి. వేరే ఎవ్వరికీ దోచిపెట్టకండి. ఏది ఏమైనా సరే, మీ అంతరాత్మ చెప్పేదాన్నే అనుసరించండి. ఎంత అసంభవం అనిపించినా సరే, మీ కలలు మీవి- వాటిమీద వేరే ఎవ్వరికీ హక్కులు ఇవ్వకండి!"

## ప్రశ్న లోనే జవాబు చూడండి

ఉదయాన్నే లేచి తాగేదేమి**టీ**?

పాదరక్షకు మరో పేరు **చెప్పు**.

'రంపాన్ని' ఇంగ్లీష్ లో ఏమంటారో తెలు**సా**?

'స్టోన్' ని తెలుగులో ఏమంటారో **రాయి**.

'ఫుట్' కి తెలుగు ఏమిటో నీ స్నేహితుడిని **అడుగు**.

'మాత' అంటే ఏమిటో చెప్పు **అమ్మా!**

'రా' ని తమిళంలో ఏమంటారో చెప్పగల**వా**?

ధవళ వర్ణం అంటే ఏ రంగో **తెలుపు**!

'కమ్' అంటే ఏమిటో చెప్పు**రా**!

'సెర్చ్' అనే పదానికి అర్థం ఏమిటో డిక్షనరీలో **వెతుకు**!

*సేకరణ: రిషివ్యాలీ బడి పిలలు*

ఇలాంటివే మీకు తెలిసి నవ్వు పుట్టించే పదాలు, వాక్యాలు మరికొన్ని ఉంటే మాకు రాసి పంపండి.

# దొంగ లేడు

బౌద్ధ కథ

*చాలా గొప్ప తాత్వికత దాగున్న కథల్లో ఇది ఒకటి. 'దొంగ ఉన్నాడు' అనుకున్నంత కాలం ఆ దొంగ మన కళ్లముందే ఉంటాడు. 'లేడు' అని తెలుసుకున్ననాడు వాడు 'ఉండడు'. దీన్ని చదివి ఏం అర్థమైందో చెప్పండి మీరున్నూ...*



జెన్ బౌద్ధ గురువు 'షిచిరి' గురించిన కథ ఇది.

ప్రతిరోజూ రాత్రి ఎనిమిది కల్లా అందరినీ ఎవరి దారిన వాళ్ళను పంపించేసి, ఒంటరిగా, తన మానాన తను ఉండేవాడు షిచిరి.

అలా ఒకరోజున, పడుకునేముందు అలవాటుగా కొంచెం సేపు ధ్యానానికి కూర్చున్న సమయంలో అకస్మాత్తుగా ఊడిపడ్డాడు ఒక దొంగ: ఆయన మెడమీద కత్తి ఉంచి "మర్యాదగా నీ దగ్గర ఉన్న సొమ్మునంతా నా వశం చేస్తావా, నిన్ను ఇలాగే ఖతం చెయ్యమంటావా?" అన్నాడు కరకుగా.

షిచిరీకి ఎలాగూ భయం వెయ్యలేదు; కానీ ధ్యానం చెడిపోతుందేమోనని మా చెడ్డ అనుమానం వేసింది.

"నన్ను డిస్టర్బు చెయ్యకు! డబ్బేగా, కావాల్సింది? ఎంత కావాలో అంత తీసుకో- అదిగో ఆ బీరువాలో ఉంది!" అనేసి, మళ్ళీ

తన ధ్యానంలో తను మునిగిపోయాడు.

దొంగతనం మరీ ఇంత సులువుగా అయిపోతుందని దొంగ ఊహించలేదు: అందుకని అతను చాలానే ఆశ్చర్యపోయాడు, కానీ వెంటనే తేరుకొని తన పని తను కానిచ్చాడు- బీరువాలో ఉన్న డబ్బులన్నీ ఎత్తి మూట కట్టుకుంటుంటే మధ్యలో షిచిరీ ఓమాటు కళ్ళు తెరిచి "ఇదిగో, నీ పేరేంటో గానీ- అక్కడున్న డబ్బులు మొత్తం తీసుకోకు. రేపు ప్రొద్దునే ప్రభుత్వం వారి పన్ను కట్టేందుకు కొంత వదిలిపెట్టు; కావాలంటే మిగతాది అంతా పట్టుకెళ్ళు!" అన్నాడు.

దొంగవాడు సరేనని, కొంత సొమ్మును అక్కడే వదిలి, మిగతాది మూటకట్టుకొని, ఇంటికి బయలుదేరాడు.

అతను ఇంకా గడప దాటకనే, వెనకనుండి షిచిరీ గొంతు వినిపించింది మళ్ళీ- "ఏం మనిషివయ్యా, నువ్వు?! అంత సొమ్ము తీసుకు పోతున్నావు, కనీసం 'థాంక్స్' అని ఒక్క మాట కూడా అనలేదే?! మర్యాద ఏమైంది?!" అని.

ఈసారి దొంగ నిజంగా అదిరిపోయాడు. ఒక్క క్షణం పాటు అతని మెదడు పనిచేయటం మానేసింది. "ధన్యవాదాలండి" అని గబగబా గొణిగేసి, వాడు ఇంటికి పరుగు పెట్టాడు. ఆ తర్వాత తన స్నేహితులందరికీ చెప్పాడు వాడు- 'నా జీవితంలో అంతకు ముందు ఎన్నడూ అంత భయపడి ఎరుగను' అని.



కొద్ది రోజులు గడిచాయి. దొంగ

పట్టుబడ్డాడు. వేరే ఎక్కడో దొంగతనం చేస్తూ చేస్తూ రాజభటుల చేతికి చిక్కిపోయాడు. షిచిరీ ఆశ్రమంలో చేసిన దొంగతనంతో సహా తను చేసిన ఇతర నేరాలన్నిటినీ అతను న్యాయాధికారి సమక్షంలో అంగీకరించాడు.

న్యాయాధికారిగారు వాంఙ్మూలం ఇచ్చేందుకుగాను షిచిరీని పిలిపించారు. "ఈ మనిషి మీ ఇంటి నుండి డబ్బు దొంగిలించాడట కదా?! జాగ్రత్తగా చూడండి ఇతన్ని. ఇతనేగా, దొంగ? జాగ్రత్తగా చూసి చెప్పండి" అన్నారు.

"లేదు, లేదు! నాకు ఇతను తెలుసు. ఇతను మా ఇంట్లో దొంగతనం ఏమీ చెయ్యలేదు. ఆ డబ్బంతా నేనే అతనికి ఇచ్చాను. అందుకుగాను అతను నాకు ధన్యవాదాలు కూడా చెప్పాడు!" అన్నాడు షిచిరీ చాలా మామూలుగా.

ఆ క్షణంలో దొంగ మనసు ద్రవించింది. పశ్చాత్తాపపు బీజం అతనిలో నెలకొన్నది.

తన శిక్ష ముగించుకోగానే అతను షిచిరీ దగ్గరకు వచ్చి శిష్యుడిగా స్వీకరించమని ప్రాధేయపడ్డాడు.

త్వరలోనే అతనిలోని మాలిన్యం అంతా పోయి, కడిగిన ముత్యం మాదిరి పరిశుద్ధుడయ్యాడు!

**మెదడుకు మేత!**

1. మెడ ఉన్నా తల ఉండనిది ఏది?

2. అరచెయ్యంత చేనులో పరక పుల్లంత కాలువ. ఏరోజుకారోజు సాయంత్రం ఆడమనిషి పోయి కాలవను నింపాలి! ఏంటది?

3. తోలుతో చేస్తారు; కర్రతో చేస్తారు- అదే పనిగా బాదుతారు. అయినా అన్నం పెడుతుంది! ఏమిటది?!

4. మా తాత తెల్లనోడు, బంటె మీసం మీద నిప్పు నెలబెడతారు ఎవరు?

మెదడుకు మేత! సమాధానాలు ముందే వచ్చినట్లున్నాయి, వెతకండి మరి!



# కోతిరాజు

బౌద్ధ కథ

*త్యాగం ఎంత గొప్పదో వివరించే ఇలాంటి కథలు బౌద్ధవాఙ్మయంలో చాలానే ఉన్నాయి. మనసుల్ని స్పృశించే ఈ కథలు మనలోని త్యాగభావనకు ఊపిరినూదుతాయి...*

అనగా అనగా చాలా కాలం క్రితం వింధ్య పర్వతాల్లో దట్టమైన అడవి ఒకటి ఉండేది. ఆ అడవిలో చాలా కోతులు నివసిస్తూ ఉండేవి. ఆ కోతుల రాజు చాలా పెద్దగా, చాలా లావుగా, చాలా బలంగా, మిగిలిన కోతులకంటే ప్రమాణంలో ఐదింతలు ఉండేది. అప్పటికే తాను చేసుకున్న మంచి పనుల ఫలితమేమో మరి, అది అన్ని ప్రాణులపట్లా దయ కలిగి ఉండేది; జ్ఞానంతో, మెలకువ కలిగి ప్రవర్తించేది.

ఆ అడవిలోంచి పెద్ద వాగు ఒకటి వెలువడేది. అడవి అవతల ఉన్న జనపదాల గుండా ప్రవహిస్తూ పోయి, అది ఓ పెద్ద నదిలో కలిసేది.

ఒకసారి కోతిరాజు కొన్ని కోతులను వెంటబెట్టుకొని కులాసాగా ఆ వాగు వెంబడి నడుస్తూ పోయింది. అక్కడొకచోట దానికి పెద్ద మామిడి చెట్టు కనిపించింది. పెద్ద పెద్ద కొమ్మలతో, కొమ్మ కొమ్మకూ బంగారు రంగులో మెరిసే పళ్ళతో అలరారే ఆ మామిడి చెట్టు వాగుని ఆనుకొనే ఉంది.

దాన్ని చూడగానే కోతిరాజు "ఈ చెట్టుకి ఉన్న పండ్లన్నిటినీ తక్షణం కోసి తినేయండి. కాయలన్నిటినీ కోసేయండి. ఒక్క పిందె కూడా మిగలకూడదు. లేదంటే అనర్థం ముంచుకొస్తుంది" అని తను అక్కడే నిలబడి, చెట్టుకున్న పండ్లను-కాయలను అన్నిటినీ వెతికి వెతికి కోయించేసింది.



కోతులన్నీ గబగబా మామిడి పండ్లను, కాయలను కోసి, తిన్నంత తిని సంతోషపడ్డాయి తప్పిస్తే తమ రాజు అలాంటి ఆజ్ఞ ఎందుకిచ్చాడో వాటికి తెలీలేదు. సాయంత్రం అయ్యాక, 'ఇక చెట్టంతా ఖాళీ' అని నిశ్చయించుకొని, కోతిరాజు తన అనుచరులతో సహా వచ్చిన దారి పట్టింది.

ఆ హడావిడిలో ఒక్క కాయ తప్పిపోనే పోయింది: పక్షి గూడు వెనక దాగిన పెద్ద కాయ ఒకటి మిగిలిపోయింది. కొద్ది రోజులకు ఆ కాయ మరింత పెద్దదై, చక్కగా పండింది. బంగారు రంగులో మిలమిలా మెరిసే ఆ పండు ఒకనాడు చెట్టునుండి విడివడి, క్రింద ప్రవహించే వాగులో పడి, కొట్టుకొని పోయి, నదిని చేరుకున్నది. సరిగ్గా అదే సమయానికి ధర్మదత్తుడనే రాజు నదిలో స్నానానికి వచ్చాడు.

ఆయన అలాంటి పండుని ఏనాడూ చూసి ఉండలేదు. "ఏమిటిది?" అని తన మంత్రుల్ని అడిగాడాయన. వాళ్లలో ముసలి మంత్రి ఒకడు దాన్ని గుర్తు పట్టి, "దీన్ని మామిడి పండు అంటారు ప్రభూ! చాలా మధురంగా ఉంటుందిది" అని చెప్పాడు. రాజుగారు దాన్ని ముక్కలు చేయించి, అనుమానం కొద్దీ కొన్ని ముక్కల్ని మంత్రుల

చేత తినిపించి చూసుకొని, వాళ్లకు ఏమీ కాలేదని నిర్ధారణ అయ్యాక, తనూ తిని చూశాడు. దాని రుచి అద్భుతంగా ఉంది-



ఎంత అద్భుతంగా ఉందంటే, రాజుగారికి అలాంటి పండ్లు ఇంకా ఇంకా తినాలనిపించింది.

మరుసటి రోజే ఆయన తన మంత్రుల్ని, సైనికుల్ని వెంటబెట్టుకొని వాగు వెంట పైకి నడచుకొని వచ్చాడు.

అక్కడ మామిడి చెట్టుని చూడగానే గుర్తుపట్టాడు మంత్రి. సైనికులు చెట్టు మీదికి ఎక్కి రెమ్మ రెమ్మనూ పరిశీలించారు. ఎక్కడా ఒక్క కసరు కాయ కూడా లేదు. "ఇక్కడ అడవిలో ఉన్న కోతులు ఈ పండ్లనుగాని, పండ్ల చెట్లను గానీ బ్రతకనివ్వవు" అని వాళ్ళు రాజుగారికి నివేదించారు.

రాజుగారికి ఎక్కడ లేని కోపం వచ్చింది. అడవిలో ఉన్న కోతులన్నిటినీ పట్టుకొని చంపివేయమని తన సైనికులకు ఆదేశాలిచ్చాడాయన. సైనికులు మారణ హోమం మొదలు పెట్టారు. వాళ్ళకు నాయకుడుగా ధర్మదత్తుడు తన సైన్యాన్ని ముందుండి నడపసాగాడు.

సంగతి తెల్సుకున్న కోతిరాజు తన పరివారాన్నంతటినీ ఒక చోట చేర్చి "వినండి! అనుకున్నంతా అయ్యింది. నేను భయపడిన రోజు రానే వచ్చింది! ఇప్పుడు ఇక మనం ఈ అడవిలో ఉంటే ప్రాణాలు కోల్పోవటం మినహా చేయగలిగిందేమీ లేదు. మనం ఉంటున్న ఈ అడవికి అవతలగా ఎవరూ చేరరాని వెదురు వనం ఒకటి ఉన్నది. మనందరం అక్కడికి పారిపోదాం" అన్నది.

సరిగ్గా అదే సమయానికి రాజుపంపిన సైనికులు ఆ ప్రదేశానికి చేరుకున్నారు.

వాళ్ళు వెంటబడి తరమరాగా వేలాది కోతులు- తల్లులు,పిల్లలు, గర్భిణులు, ముసలివి, రోగ గ్రస్తమైనవి- అన్నీ వేటికవి, ప్రాణభయంతో వెదురు వనం వైపుకు పరుగులు పెట్టాయి. కోతిరాజు వాటినన్నిటినీ సమీకరించుకుంటూ తనూ వెదురువనం వైపుకు పోయింది.

వెదురు వనాన్ని, మిగతా అడవిని వేరు చేస్తూ పెద్ద లోయ ఒకటి ఉన్నది. లోయకు ఇరువైపులా కొండ చరియలు ఉన్నాయి. ఆ రెండు కొండ చరియల మీదా బలమైన చెట్లున్నాయి. వాటి కొమ్మలు ఒకదానికొకటి దగ్గరగా వచ్చి ఉన్నాయి. బలమైన కోతులు ప్రయత్నించి, ఆ కొమ్మల్ని ఆధారంగా చేసుకొని లోయకు ఇటువైపు నుండి అటువైపుకు దూకవచ్చు. కానీ ఒకవేళ జారిలోయలో పడితే మటుకు ప్రాణాలు దక్కవు.

మొదట్లో బలంగా ఉన్న కొన్ని కోతులు ప్రాణాల మీద ఆశ కొద్దీ లోయను లంఘించేందుకు ప్రయత్నించాయి. వాటిలో కొన్ని అంతెత్తునుండి గింగిరాలు తిరుగుతూ లోయలో పడి ప్రాణాలు విడవటంతో, మిగిలిన కోతులను అధైర్యం ఆవరించుకున్నది. "మనం దూకలేం" అని నిస్సత్తువతో కూలబడ్డాయన్నీ. రాజుగారు, రాజుగారి సైనికులు వాటిని వెంటాడుతూ దగ్గరకు వచ్చేస్తున్నారు!

ఆ సమయంలో కోతిరాజు అక్కడికి చేరుకున్నది. మిగిలిన కోతులకంటే బలంగా, అతి పెద్ద శరీరం ఉన్న కోతిరాజు అప్పటికప్పుడు ఒక నిర్ణయం తీసుకున్నది:

లోయకు ఇటు ప్రక్కన ఉన్న చెట్టు కొమ్మల్ని కాళ్ళతో గట్టిగా బిగించి పట్టుకొని, అటువైపున ఉన్న చెట్టుకొమ్మల్ని చేతులతో పట్టుకొని, రెండింటి నడుమా తన శరీరంతోటే ఒక వంతెనను తయారు చేసింది. "అందరూ నామీదుగా నడచుకొని పొండి! ప్రకృతి నన్ను ఇంత పెద్దగా సృష్టించటంలో రహస్యం ఇదే అయి ఉంటుంది" అన్నదది, నిబ్బరంగా.

మరు నిముషంలోనే వేలాది కోతులు దాని

శరీరం మీదుగా నడుస్తూ, పరుగెత్తుతూ, దూకుతూ, పోటీలు పడి లోయకు అవతలి గట్టును చేరుకోసాగాయి. వాటన్నిటి బరువునూ మోస్తూ, నొప్పిని పళ్ళ బిగువున భరిస్తూ కూడా కోతిరాజు "ఆహా! నా కారణంగా ఇంతమందికి రక్షణ లభిస్తున్నది. అది చాలు" అనుకుంటూ వచ్చింది.



ఆ కోతుల్లో కొన్నిటికి కోతిరాజంటే కోపం ఉండేది. అట్లాంటి కోతుల్లో ఒకటి, సమయం చిక్కిందే తడవు, తన చేతిలోని ఇనుప కడ్డీని ఒకదాన్ని కోతిరాజు గుండెల్లో దిగబడేట్టు గుచ్చుతూ అవతలి ఒడ్డుకు దూకి పోయింది! ఆ సమయంలో కోతిరాజు పెట్టిన కేక అడవంతా ప్రతిధ్వనించింది. అంత విపత్తులోనూ అది తన ప్రజలంతా అవతలి గట్టును చేరేంతవరకూ తట్టుకొని, అటుపైన ఒక్కసారిగా కుప్పకూలింది!

కోతిరాజు చేసిన పనినంతా గమనిస్తూ వచ్చిన ధర్మదత్తుడు తన సైనికులను హెచ్చరించి, కోతిరాజు లోయలో పడిపోకుండా కాపాడాడు. తోటి కోతుల కోసం అంత త్యాగం చేసిన కోతిరాజుని చూస్తే ధర్మదత్తుడికి మనసు నిలవలేదు. అయితే దాని శరీరంలో గుచ్చుకున్న శూలం బారినుండి దాన్ని కాపాడటం కష్టమే. చనిపోయే ముందు స్పృహలోకి వచ్చిన కోతిరాజుతో ధర్మగుప్తుడు "ఎందుకిట్లా చేశావు? నువ్వు వాళ్ల రాజువి కదా" అంటూ కంట తడి పెట్టాడు.

ప్రాణాలు కోల్పోతున్న కోతిరాజు నవ్వింది. "నేను వాళ్ల రాజుని కదా, అందుకని!" అన్నది. అంతలోనే దాని ప్రాణాలు పోయాయి.

కోతిరాజు త్యాగం ధర్మదత్తుడి కళ్ళు తెరిపించింది. 'మంచిరాజు తన పౌరులను సొంత ప్రాణాలకంటే ఎక్కువగా ప్రేమించాలి' అని ఆయనకు అర్థమైంది.

"నేను ఇక మీద హింసను మానేస్తాను. మంచి రాజునౌతాను" అనుకున్నాడాయన.

అటుపైన ఆయన రాజ్యంలో మనుషులే కాక అన్ని ప్రాణులూ సుఖశాంతులతో జీవించాయి. 

తేజ విద్యాలయం- కోదాడ పిల్లల వాన కవితలు

వర్షం రాకతో...
తాతయ్య వెళతాడు పొలం దున్నడానికి..
నానమ్మ వెళుతుంది వంటింట్లోకి బజ్జీలు వేయడానికి..
నాన్న కిటికీ పక్కకు చేరతాడు కవితలు వ్రాయడానికి
అమ్మ వరండాలోకి వెళుతుంది వానని ఆస్వాదించడానికి..
అన్న పుస్తకం తీస్తాడు కథలు చదవడానికి..
నేను మాత్రం తయారుగా ఉంటాను ఎగరడానికి....

-వి. శ్రీ మహా, ఆరవ తరగతి.

వానా వానా రావమ్మ,
పొలాల్లో నీళ్ళు నింపమ్మా,
పంటలు బాగా పండించమ్మా,
పరీక్ష ఫీజు కట్టాలమ్మా,
ఫస్టుగ పాసు కావాలమ్మా,
పై పై చదువులు చదవాలమ్మ,
పుడమి తల్లికి సేవ చేయాలమ్మా...

-మేఘన, ఆరవ తరగతి

వానా నీవు ఉండేది ఆకాశాన
ఎదురుచూస్తుంటాను నీకోసం ప్రతినిముషాన
వానా! నీవు రాకపోతే చిన్నబోతుంది కృష్ణమ్మ
వానా! నీవు అలిగిపోతే నష్టపోతాడు రైతన్న
వానా! నీ రాకతో రత్నాలు పండేను ఇలలోన
సిరులతో నిండాలి నా తెలంగాణ

-హరి భరత్, ఆరవ తరగతి

ఓ వర్షమా నువ్వు పడినచోట
పచ్చదనం చిగురిస్తుంది
నువ్వు పడగానే హరివిల్లు విరుస్తుంది
నువ్వు వస్తే రైతులకు సంతోషం
నువ్వు వస్తే పిల్లల కేరింతలు
మరి నీ రాక ఎప్పుడు....

-సాయి చరణ్, ఆరవ తరగతి

# కెన్నెత్ షినోజూకా

యువకెరటాలు

*నిర్వహణ: సౌమ్య, పుస్తకం డాట్ నెట్*



ఇంట్లో ముసలివాళ్ళను ఒంటరిగా వదిలి అందరూ ఆఫీసులకు, బడులకు వెళ్ళిపోయారనుకోండి- ఆ సమయంలో వాళ్ళకు ఏదన్నా జరిగితే, వాళ్ళ వాళ్ళకి వెంటనే తెలిస్తే మంచిది కదా? కానీ ఎలా తెలుస్తుంది?

ఆరేళ్ల కెన్నెత్‌కి ఒక ఐడియా వచ్చింది. వాడు కనిపెట్టిన పరికరం ఈ సమస్యకి ఒక పరిష్కారమట! వయస్సైపోయిన వారు ఎవరైనా బాత్రూములో గానీ వేరే ఎక్కడన్నా గానీ జారి క్రింద పడితే, వెంటనే వాళ్ళ బాగోగులు చూసేవాళ్ళకి ఆ పరికరం ఒక మెసేజి పంపుతుందట! బాగుంది కదూ?

ఇంక ఆ మరుసటి సంవత్సరం, తనకు ఏడేళ్లప్పుడు, అతను పేషంట్లకు సాయపడే మరో పరికరాన్ని కూడా కనిపెట్టాడట: అది- 'తెలివైన మందుల పెట్టె'! మందులు వేసుకునే సమయం అవగానే అది శబ్దం చేస్తూ వెలుగులు విరజిమ్ముతుందట- మర్చిపోకుండా మందు వేసుకొమ్మని పేషంట్లకు గుర్తు చేస్తుందన్నమాట!



కెన్నెత్ వాళ్ళ తాతయ్యకి, జ్ఞాపకశక్తికి సంబంధించిన ఒక వ్యాధి- 'అల్జయిమర్స్' వచ్చిందట. ఎవరికీ చెప్పాపెట్టకుండా బయటకు వెళ్ళిపోతూ ఉండేవాడట ఆయన. ఒకసారి బయటికి వెళ్తే మళ్ళీ ఇంటికి రాలేదు- దారి మర్చిపోతాడాయె! మరి ఈ సమస్యని పరిష్కరించేదెలా? వెంటనే కెన్నెత్ సెన్సార్ల గురించి, వాటిని నడిపే బ్యాటరీల గురించి, కనుక్కొని, తాతయ్య కాలి మడమ వద్ద 'ప్రెషర్ సెన్సార్' ఒకదాన్ని అమర్చాడట. దాన్ని వాడుకొని,

తాతయ్య బయట అడుగు పెట్టినప్పుడల్లా వాళ్ళ అత్తయ్య మొబైల్ ఫోనుకు మెసేజ్ వెళ్ళేలా ఓ పరికరాన్ని తయారు చేశాడట! ఆ పరికరం పనితీరు చూసి ఇంటిల్లిపాదీ బిత్తరపోయారట!

మరి ఇంత చక్కటి ఆవిష్కరణలకు అవార్డు రాకపోతే ఎలాగ? వచ్చింది! అమెరికాలో 'సైంటిఫిక్ అమెరికన్' అనే ఒక పత్రిక, 150 ఏళ్ళుగా సైన్స్ సమాచారాన్ని సామాన్య ప్రజలకి అందించే వ్యాసాల్ని ప్రచురిస్తూ ఉంది. ఈ పత్రిక వాళ్ళు మూడేళ్ళుగా ప్రతి ఏటా 'సైన్స్ ఇన్ యాక్షన్' అని ఒక అవార్డు ఇస్తున్నారు. మొన్న- అక్టోబరు మాసం చివర్లోనే, ఆ అవార్డును ఈ ఏడాదికి 'కెన్నెత్ షినోజువాకు ఇస్తున్నట్లు' ప్రకటించారు! గూగుల్ కంపెనీవాళ్ళు ఏటా నిర్వహించే సైన్సు పోటీలో తను కనుగొన్న పరికరాన్ని ప్రదర్శించినందుకుగాను కెన్నెత్‌కు సైంటిఫిక్ అమెరికన్ అవార్డు వచ్చిందనమాట!

ఇప్పుడు 15 ఏళ్ళున్న కెన్నెత్ అమెరికాలోని న్యూయార్క్ నివాసి. వాళ్ల అమ్మానాన్నలు ఇద్దరూ సివిల్ ఇంజనీరింగు ప్రొఫెసర్లు. 'ఆధునిక సాంకేతికత మనుషుల జీవితాల్ని ఎలా మార్చగలదో' కెన్నెత్‌కు దీనితో అర్థమైందట. 'భవిష్యత్తులో ఇంజనీరింగునూ-న్యూరో సైన్సునూ రెంటినీ కలుపుతూ అల్జయిమర్స్ వ్యాధికి పరిష్కారం కనుక్కోవటం' తన కోరికట! కెన్నెత్ సమాజానికి ఉపయోగపడే మరిన్ని పరికరాలను ఆవిష్కరించాలని ఆశిద్దాం!

ఇది మీకెందుకు చెబుతున్నానంటే- చూశారుగా, సమస్యలు మనకూ లెక్కలేనన్ని ఉన్నాయి. కెన్నెత్‌లాగా ఒక్కో సమస్యకూ పరిష్కారం కనుక్కుంటూ పోతే మనందరి జీవితాలూ సరళం అవుతాయి- కదూ?

నవ్వు!

**మరో గాంధీగారు!**

రాజు: నేను మళ్ళీ ఫెయిల్ అయ్యాననే విషయం మా నాన్నకు ఎలా చెప్పాలో తెలియట్లేదురా.

రవి: ఏముంది, "ఫలితాలు వచ్చాయి. మార్కులు గతంలో లానే ఉన్నాయి" అని చీటీ మీద రాసి ఆయన చేతికి ఇచ్చెయ్యిరా.

# పాట నేర్చుకుందాం!



*గురు పూజోత్సవాన్ని పురస్కరించుకొని, ఈసారి పాట- "మైత్రీం భజతాం". ఇది కంచి పరమాచార్యుల వారి రచన. మనందరం ఏమేం చెయ్యాలో చెప్పే ఈ ప్రార్థనా గీతానికి సంగీతం శ్రీ వసంత దేశాయి గారు సమకూర్చగా, భారతరత్న-సంగీతకళానిధి యమ్మెస్ సుబ్బలక్ష్మి గారు దీన్ని 1966 లో ఐక్యరాజ్యసమితిలో పాడారు.*
*సేకరణ, గానం : సుష్మ, సౌమ్య నిట్టల, ఆరోహి మ్యూజిక్.*

పాట:

మైత్రీం భజతాం అఖిల హృద్ జేత్రీం

ఆత్మవదేవ పరానపి పశ్యత
యుద్ధం త్యజత స్పర్ధాం త్యజత
త్యజత పరేషు అక్రమమాక్రమణం
। మైత్రీం।

జననీ పృథివీ కామదుఘాస్తే
జనకో దేవ: సకల దయాళు:
దామ్యత దత్తా దయధ్వం జనతా:

శ్రేయో భూయాత్ సకల జనానాం

అర్థం:

హృదయాల్ని గెల్చుకునే మైత్రిని మనలో నిల్పుకుందాం
మనల్ని మనం ఎలా భావించి గౌరవించుకుంటామో,
ఇతరులను కూడా అలా మనలాగానే భావిద్దాం.
యుద్ధాలను, పోరాటాలను వదిలిపెడదాం.
పనికిమాలిన పోటీని వదిలిపెడదాం.
ఇతరులపైకి అక్రమంగా దండెత్తటాన్ని వదిలేద్దాం.
ఎందుకంటే, ఈ భూమాత మన కోరికలన్నిటినీ తీరుస్తుంది
మన తండ్రి ఐన ఆ భగవంతుడు పరమ దయాశాలి.
అందుకని మనం చెడును నిగ్రహించాలి. ప్రపంచంలోని
జనులందరి శ్రేయస్సునూ కోరుతూ ఏదైనా ఇవ్వగలగాలి.
ఎల్లప్పుడూ దయతో వ్యవహరించగలగాలి.

ప్రపంచంలోని జనులందరికీ మేలు కలుగుగాక!

ఈ పాటను మీరు ఇంటర్నెట్లో http://kottapalli.in వద్ద వినచ్చు, డౌన్లోడు చేసుకోవచ్చు !

# తెలుసుకుందాం!

*శాస్త్ర సంబంధమైన అంశాలు, సమాజానికి సంబంధించిన అంశాలు కూడా కథల్లాగే, చాలా బాగుంటాయి. ఏమంటే వాటిని మనం మన భాషలో, ఇష్టంగా తెలుసుకునేందుకు వీలుండాలి. అట్లాంటి పలు అంశాలను ప్రస్తావించే వేదిక, ఈ 'తెలుసుకుందాం ' శీర్షిక.*

## సర్వేపల్లి రాధా కృష్ణన్- గురుపూజోత్సవం



స్వతంత్ర భారత దేశానికి తొలి ఉపరాష్ట్రపతిగాను, ఆ తర్వాత 1967 వరకూ రాష్ట్రపతిగా కూడానూ పనిచేసిన సర్వేపల్లి రాధాకృష్ణన్ 1888, సెప్టెంబరు 5 న తమిళనాడులో జన్మించారు.

హిందూమతం గురించీ ఆధ్యాత్మికత గురించీ అనేక ప్రామాణిక గ్రంధాలు రచించారాయన.

రాధాకృష్ణన్ మొదట మైసూరు విశ్వవిద్యాలయంలో ఆచార్యుడిగా పని చేశారు. అటుపైన బెనారస్ హిందూ యూనివర్సిటీతో సహా అనేక దేశ విదేశ విశ్వవిద్యాలయాలకు ఆచార్యుడిగాను, కులపతిగాను సేవలందించి, 1975 లో పరమపదించారు.

ఉపాధ్యాయ వృత్తికి తలమానికమైన సర్వేపల్లి పుట్టిన రోజు సెప్టెంబరు 5 వ తేదీని మనం ఈనాటికీ గురుపూజోత్సవంగా జరుపుకుంటున్నాం.

## బాక్సింగ్ యోద్ధ - మేరీ కోం



మణిపూర్ రాష్ట్రానికి చెందిన 31 ఏళ్ల మేరీ కోం మహిళా బాక్సర్‌గా ప్రపంచ ఖ్యాతినార్జించింది. పురుషుల ప్రాధాన్యతే కలిగిన బాక్సింగ్ క్రీడను మహిళా ప్రపంచానికి పరిచయం చేసిన ఘనత ఆమెదే.

2012 ఒలింపిక్ క్రీడల్లో మేరీకోం మన దేశానికి బాక్సింగ్‌లో కాంస్య పతకాన్ని సాధించి పెట్టింది. ఆ సంవత్సరంలోనే ఆమె పద్మభూషణ్ పురస్కారం కూడా లభించింది.



ఈశాన్య భారతంలోని యువకులకు బాక్సింగ్ క్రీడలో శిక్షణ ఇచ్చేందుకు గాను మణిపూర్ రాజధాని ఇంఫాల్‌లో మేరీకోం స్థాపించిన 'ప్రాంతీయ బాక్సింగ్ అకాడమీ' కి ఈ మధ్య కాలంలో మంచి స్పందన లభించింది.

మేరీ కోం జీవిత చరిత్ర ఆధారంగా తీసిన సినిమా కూడా ఒకటి ఈ మాసంలోనే విడుదల కానున్నది.

## శాస్త్రవేత్త సి యన్ ఆర్ రావు



రసాయన శాస్త్రానికి చేసిన సేవలకు గాను గత సంవత్సరం భారత రత్న అందుకున్న ఆచార్య 'చింతామణి నాగేశ రామచంద్రరావు' (సి యన్ ఆర్ రావు) కర్ణాటక రాష్ట్రం వాడు.

భారత అంతరిక్ష పరిశోధనా సంస్థ (ఇస్రో)లో పరిశోధకుడిగాను, ఐ.ఐ.టీ కాన్పూరులో ఆచార్యుడిగాను, బెంగుళూరులోని ఐ.ఐ.యస్.సీకి ఒక దశాబ్దం పాటు డైరెక్టరుగాను, ఇంకా ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జ్, క్యాలిఫోర్నియా వంటి అనేక విశ్వవిద్యాలయాలలో ఆచార్యుడిగాను గొప్ప పేరు ప్రతిష్టలు సంపాదించుకున్న సియన్నార్ రావుకు 'ఘన స్థితి రసాయన శాస్త్రం అన్నా, కణ నిర్మాణ రసాయన శాస్త్రం' అన్నా చాలా ఇష్టం.

అధిక ఉష్ణోగ్రతల్లో పనిచేసే సూపర్ కండక్టర్లను తయారు చేసేందుకు ఉపయోగపడే మిశ్రలోహాల ఆక్సైడులను గురించి సియన్నార్ రావు చేసిన పరిశోధనలు చాలా ప్రామాణికమైనవిగా గుర్తించబడుతున్నాయి. 'శాస్త్ర పరిశోధనా రంగాలకు ప్రభుత్వ కేటాయింపులు మరింత పెంచాలి' అని సియన్నార్ రావు ప్రగాఢంగా విశ్వసిస్తారు. 

# పదరంగం 71

*నిర్వహణ: డా.సిరి, మిర్యాలగూడ, నల్గొండ జిల్లా, తెలంగాణ.*

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | 2 | ■ | 3 | | 4 |
| ■ | 5 | 6 | ■ | ■ | |
| 7 | ■ | | ■ | 9 | |
| 10 | | | ■ | | ■ |
| | ■ | ■ | 11 | | 12 |
| 13 | | | | ■ | |

## అడ్డం

1.అచ్చుల తరువాత వచ్చేది, తిరగబడింది(2)

3. మెడలో ధరించేది (3)

5. రావణుడు సీతమ్మను దాచిపెట్టిన స్థలం(2)

9. ముందు సగం పోయిన ధన్వంతరి! (2)

10. జలుబు చేసినప్పుడు ఇవి వస్తాయి! (3)

11. గజిబిజైన 'తగువు' (3)

13. సంస్కృతంలో సుభాషితాలు రాసిన గొప్ప కవి (4)

## నిలువు

2. పొలం దున్నే సాధనం (2)

4. 'ముర' కు శత్రువు- కృష్ణుడే, మరో పేరన్నమాట! (3)

6. "కొత్తపల్లి" ఉన్నది వీటిని చదివించటం కోసమే! (3)

7. రాముడి తమ్ముళ్ళతో ఒకడు తలక్రిందులయ్యాడు (4)

9. చెట్టుకే మరో పేరు (3)

11. ఇది చూసి బాణం వెయ్యాలి (2)

12. రోజూ దీన్ని దువ్వుకోవాలి (2)

అడ్డం-నిలువు ఆధారాల సహాయంతో ఈ గడులను నింపగలరేమో చూడండి. నింపిన పదరంగాన్ని, కేవలం పోస్టుకార్డుపై రాసి, మాకు అందేట్లు పంపండి. మీ బడి పేరు, తరగతి, మీవాళ్ల ఫోను నంబరు తప్పక రాయండి. సరైన సమాధానం రాసి ఎంపికైన ముగ్గురు పిల్లలకు కొత్తపల్లి-73 ని బహుమతిగా పంపిస్తాం!

కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, యం ఆర్ వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా-515101

# పదాల్ని వెతికి పట్టుకోండి!

**ఘనత, అనగనగా, పత్రికలు, సుఖశాంతులు, పచ్చదనం, జంతువులు, బరువు, అధిదేవత, అరటి, అగ్నిపర్వతం, ఆభరణం, రాజధాని, మంత్రాలు, వేటగాడు, చీలమండ, బాతుపిల్ల, విషయము, సురక్షితం, త్రాగునీరు, తరగతి-**

పై పదాలన్నీ ఈ క్రింది పట్టికలో దాగున్నాయి- నిలువుగా, అడ్డంగా, వాలుగా, క్రిందినుండి పైకి- ఎటుపడితే అటు! వాటిని వెతికి పట్టుకోండి. వాటి చుట్టూ గుండ్రాలు గీయండి!

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| వే | ఘ | ర్వ | గ్ని | క్షి | మం | ఆ | వి | ధి | జం | మం | ప |
| అ | ల్ల | ణం | లు | వు | తు | జం | ష | త్రా | ఘ | త్రి | చ్ఛ |
| గ్ని | న | దే | ర | ఖ | శాం | ల్ల | య | వే | క | మం | ద |
| ప | చ్ఛ | గ | తి | భ | సు | భ | ము | లు | త్రా | ర్వ | నం |
| ర్వ | దే | గ | న | సు | ఆ | ర | జం | లు | అ | చ్ఛ | త్రా |
| తం | ర | రా | ని | గా | ర్వ | మం | క్షి | వే | ధి | ర | మం |
| త | ర్వ | జ | ల్ల | ధా | జం | గ్ని | ఘ | తం | దే | ల్ల | టి |
| ల్ల | త్రా | పి | లు | బా | జ | క్షి | చ్ఛ | న | వ | శాం | రు |
| గ్ని | తు | రా | తు | తం | త్రా | రా | ధా | డ | త | ష | నీ |
| బా | క్షి | తం | శాం | క్షి | ఖ | జం | వు | త్రి | మం | వు | గు |
| ధి | ఘ | త్రి | ఖ | డు | గా | ట | వే | రు | ల | దే | త్రా |
| శాం | ప | బ | సు | చ్ఛ | ష | గ్ని | ష | చీ | బ | గ్ని | చీ |

# బొమ్మకు కథ రాయండి!

*నిర్వహణ : కొత్తపల్లి*



మేఘాలమీద ఉరకలెత్తే గుర్రాన్ని తోలుతున్న ఈ రాజ కుమారుడిని చూడండి!

ఈ బొమ్మను 'సత్తిరాజు లక్ష్మీనారాయణ' అనే ఇరవై రెండేళ్ల కుర్రాడు, 1955 లో గీశాడు.

ఆ రోజుల్లో పిల్లల్ని బలేగా చదివించిన బొమ్మల పత్రిక- 'బాల' -కోసం దీన్ని అతను ముఖచిత్రంగా వేశాడు.

తర్వాత రాను రాను ఆ కుర్రాడికి బాగా చెయ్యి తిరిగింది- ఇంకా ఇంకా  మంచి బొమ్మలు గీస్తూ పోయాడు. చాలా చాలా పేరు సంపాదించుకున్నాడు.  ఎంతో మంది కళాకారులకు స్ఫూర్తినిచ్చాడు. లెక్కలేనన్ని పుస్తకాలకు అలవోకగా బొమ్మలు గీసి పెట్టాడు.

అతనెవరో కాదు-  ప్రసిద్ధ చిత్రకారుడు, సినిమా దర్శకుడు- బాపు ! బాపు అసలు పేరు సత్తిరాజు లక్ష్మి నారాయణ!

బాపు ఆనాడెప్పుడో గీసిన బొమ్మకు, మరి మీరు ఈనాడు ఓ కథ రాయగలరేమో చూడండి!

మీ కథ బాగుంటే కొత్తపల్లిలో ప్రచురిద్దాం, అందరి చేతా చదివిద్దాం. త్వరగా రాసి పంపండి మరి!

మా చిరునామా:

కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, యం.ఆర్.వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా- 515101

మంచి పుస్తకం:

## రెక్కల ఏనుగులు

కొన్ని యుగాల క్రితం రెక్కల ఏనుగులు ఉండేవట. అవి గాలిలో అనాయాసంగా ప్రయాణం చేసేవట. మరి వాటి రెక్కలకు ఏమైంది, ఆ ఎగిరే శక్తికి ఏమైంది?

"రాజా! నా గ్రంథాలు నాకు ప్రాణంతో సమానం. మీకు నా గ్రంథాలు కావాలంటే ముందుగా నా ప్రాణాలు తీయవలసి ఉంటుంది" అని ఎవరు ఎవరితో అన్నారు?

"తమ అవసరాలు తీరటానికి చాలినంత సంపాదించినంత కాలం మనుషులు సంతృప్తితో ఉంటారు. వీలైనంత వరకూ ఇతరులకూ సహాయపడతారు. అవసరాలకు మించిన సంపద చేరగానే అప్పుడు అహంకారం, అత్యాశ, స్వార్థం మనుసులో చోటు చేసుకుంటాయి" అన్న అద్భుత సత్యాన్ని ఎవరు చెబుతున్నారు, ఏ సందర్భంలో?

"రాజా! నాతో తలపడడానికి కత్తులు కాని కత్తులు వెయ్యి కావాలి. నా గుహకు రావాలంటే వంతెన కాని వంతెనను దాటవలసి ఉంటుంది. నేను ఓడటమంటూ ఉంటే అది నీరుకాని నీరుతోనే సాధ్యం" అన్న రాక్షసుడిని రాజు ఎలా గెలిచాడు?

వీటన్నిటికీ జవాబులు కావాలంటే, మరి ఈ పుస్తకం చదవాల్సిందే!

పిల్లలను, పెద్దలను అందరినీ మురిపించే ఈ చిన్ని పుస్తకంలో మొత్తం 25 కథలు ఉన్నాయి. ఐదో తరగతి పిల్లలకు కూడా అర్థం అయ్యే భాష, మంచి బొమ్మలు. పుస్తకం బాగుంది! అందరూ సంపాదించి చదవండి మరి!




**రెక్కల ఏనుగులు**

ఆర్.శాంత సుందరి

జె.పి.పబ్లికేషన్స్,

ఏలూరు రోడ్డు,




విజయవాడ ఫోన్: 0866243946

వెల: 50 రూ.

## కొత్తపల్లి గురించి ఓ పేజీ

పూర్వం ఒక రాజుగారికి ఉన్న నలుగురు కొడుకులూ అప్రయోజకులయ్యారట. బహుశ: తండ్రిగారి క్రమశిక్షణ మరీ ఎక్కువైపోయిందేమో, వాళ్లకి ఏం చెప్పినా అర్థం కావట్లేదు. తల్లిదండ్రులూ, అమాత్యులూ, గురువులూ ఏం చెప్పాలని నోరు తెరిచినా వాళ్ల చెవులు మూసుకుపోతున్నాయి. తెలివి తేటలకేమీ తక్కువ లేదు. ఉన్నదల్లా అప్రయోజకత్వమే.

చివరికి రాజుగారు విష్ణుశర్మ అనే పండితుడిని రావించి, ఆయన్ని గౌరవించి, తన కొడుకుల్ని చూపించి, "వాళ్లని మీరే తీర్చిదిద్దాలని వేడుకున్నారు.విష్ణుశర్మ సరేనని వాళ్లని వెంటబెట్టుకెళ్ళారు. ఆరు నెలల్లో వాళ్లు నలుగురూ ప్రయోజకులై తిరిగి వచ్చారు!

విష్ణుశర్మ వాళ్లమీద వ్యాకరణ శాస్త్రాలనూ, వేదమంత్రాలనూ, క్షత్రియోచిత యుద్ధ విద్యల్నీ రుద్దలేదు. పుస్తకాలు ముందు పడేసి చదవకపోతే ఊరుకోనని ఉరమలేదు. కథలు చెబుతూ పోయాడు. ఆ కథలే రాజుగారి కొడుకుల్ని ప్రయోజకుల్ని చేశాయి. నీతి చంద్రికగానూ, పంచతంత్రంగానూ పేరొందాయి.

కథలు, ఆటలు, పాటలు వృథాపోవు. వాటిలో పిల్లలకు వాళ్లదైన ఒక ప్రపంచం దొరుకుతుంది. ఆ ప్రపంచంలో స్వేచ్ఛగా రెక్కలార్చుకుంటూ తిరిగి, వాళ్లు ఇతర ప్రాపంచిక విషయాల్ని సునాయసంగా నేర్చుకుంటారు. కథలు, ఆట పాటలు సేద తీరుస్తాయి. సేద తీరిన మనసులు ఊరట చెంది, మంచి మనుషుల్ని తయారు చేస్తాయి. సమాజంలో శాస్త్ర విషయాల్ని లోతుగా నేర్వాలంటే మనుషులకు వాటి పట్ల మక్కువ అవసరం. కళలు ఆ మక్కువని నిర్మిస్తాయి.

తెలుగు పిల్లలకు సంతోషాన్ని ఇచ్చేందుకుగాను మానవీయ స్పర్శ ఉన్న కథల్నీ, ఆటపాటల్నీ , విద్యా, విజ్ఞాన, వినోదాల్నీ పిల్లల స్వీయ దృక్పథంలో, బేషరతుగా అందించే ఉద్దేశంతో "కొత్తపల్లి" మీ ముందు నిల్చింది.

మీరు పిల్లలైతే, ఈ రచనల్ని, బొమ్మల్ని, పాటల్ని చదవండి, చూడండి, వినండి, ఆనందించండి. ఇలాంటివి మీకూ వచ్చి ఉంటాయి అనేకం. మాతో వాటిని పంచుకోండి. మీ రచనల్ని కూడా కొత్తపల్లి పత్రిక ప్రచురించగలదు. మీరు పెద్దలైతే, మళ్ళీ ఓసారి పిల్లల ప్రపంచంలోకి అడుగు పెట్టండి. వాళ్లకు నచ్చేవేవో చూడండి. మీ పిల్లలకు వీటిని చదివిపెట్టండి, వారిచేత చదివించండి, వాళ్లకు వినిపించండి, మీరూ ఈ పాటలు పాడుకోండి. మీలోని సృజనకూ పదును పెట్టండి. పిల్లలకు పనికొచ్చే రచనలు ఏమైనా ఉంటే మాకు పంపండి. స్నేహ హస్తాన్నందించండి, మీకు చేతనైన సాయం చేయండి.

Published by NarayanaSarma for Kottapalli Prachuranalu,1-127/A, Near M.R.O.Office, Chennekothapalli-515101, Ananthapur District, AP.
Ph: 7702877670 mail: team@kottapalli.in and printed at Mudrica Offset Printers, Vijayawada,Phone:08662579129